# జయదేవ

(నాటకం)

యువ బుక్ డిపో
ఆచారప్పన్‌వీధి : : గవర్నరుపేట
మద్రాసు : : బెజవాడ

# వొచ్చేవాళ్లు

జయదేవుడు—వొక్కడే పురుషుడు

పద్మావతి

సువర్ణముఖి

యశోద

రాణి

దేవలత }
సుహాసిని } జయదేవుని సఖులు
భ్రమర }
మదాలస }

లాలస—కూతురు

వృద్ధభిక్షుకి

భర్తకంఠం

# ఒకటో రంగం

[రాత్రి పదకొండు గంటలు—రాజుగారి దివాణంముందు జయదేవుడు కూచుని పాడుతున్నాడు... నలినీ, మాలినీ మాట్లాడుతుంటూ వొచ్చారు.]

నలిని

ఎన్నాళ్ళీ విలాపం ?

మాలిని

దుర్గ ప్రవేశం కావాలి, వీడు మానాలి.

నలిని

వీడి సాహసానికి పరిమితి వుందా ?

మాలిని

చక్రవర్తి నిర్లక్ష్యం చూడు.

నలిని

రాణి ప్రార్థనపైన వుపేక్షిస్తున్నాడు. అదిగాక రాణిశీలంలో అమిత విశ్వాసం రాజుకి.

మాలిని

ఎంతకాలం యీ విలాపం ?

నలిని

రాణి యీపాట తన చెవుల బడకుండా నాలుగు రాత్రులనించి మైనం పెట్టుకుంది.

మాలిని

వీడి నోరు మూయించకూడదూ ?

నలిని

ఎవణ్ణి ఏస్త్రీకూడా నిరాకరించలే దనే కీర్తివుందో, అతన్ని నిరాకరించా ననే కీర్తి పొందాలని ఆమె. ఎవర్ని యే పరపురుషుడూ యెరగడో ఆ రాణిని స్వాధీనం చేసుకోవాలనే కీర్తికి యితను ప్రయత్నిస్తున్నాడు.

మాలిని

మరి యీ కృత్రిమ బధిరత్వం ?

నలిని

మూడు దినాలు నిగ్రహించింది యీ గానమాధురిని, అసహాయంతో.

[వెళ్ళిపోయినారు. జయదేవుడు పాడుతున్నాడు, పూళ్ళోంచి ఫల హారాలు పట్టుకుని స్త్రీలు వొచ్చారు.]

దేవలత

ఒకసారి కటాక్ష వీక్షణాలు మాపైని ప్రసరింప చెయ్యాలి.

జయదేవుడు

ఎవరు ? దేవలతా ?

సుహాసిని

(పూలహారం వేస్తూ) నేను సుహాసినిని.

జయదేవుడు

సుహాసినా ! వృద్ధ సింహం యేమంటోంది ?

భ్రమర

మీరు మహాదీక్షలో మగ్నులైనారని తెలిసింతరవాత కొంచెం ధైర్యం తెచ్చుకుంది.

దేవలత

మా యిళ్ళన్నీ శ్మశానాలైనాయి.

భ్రమర

కళ్ళు తెరిస్తే మూగే అధైర్యాన్నీ, నిరాశనీ, ప్రయత్నించి పారతోలి, యెట్లాగో ప్రాణాన్ని నిలుపుకుంటున్నాము.

జయదేవుడు

వెతుక సౌందర్యాల్ని వెదజిమ్మే ఆ కన్యయెవరు ?....సిగ్గా ?

భ్రమర

లాలస.

జయ దేవుడు

ఆపేరు సుందరానుభవాల్ని స్ఫురింప చెయ్యదే !

లాలస

తమ పుత్రికను తమరే మరిచారే!

జయ దేవుడు

తప్పు నాది. కాని లాలసా, నీచూపుల్లోంచి కన్నీళ్ళు వొలుకుతున్నాయేం?

సువర్ణముఖి

విద్యానాధుడి కిస్తారుట.

జయ దేవుడు

విద్యానాధుడికా? ఆ జడుడికి, ఆ సంగీత బధిరుడికి! రాజనేత్రి ఆలోచనేనా? లేక భర్తదా?

లాలస

అమ్మదే.

జయ దేవుడు

లాలసా! నీతల్లి భర్త, నీవు తన పుత్రిక వంటాడు కాబోలు! రాజనేత్రితో మాట్లాడతాను. కాని దానిలో ఆత్మపై శాల్యం నశించింది. అయినా....

లాలస

వ్యవధి లేదు.

జయ దేవుడు

ఇంటికి వెళ్లు. భ్రమరా, లాలసను నీదగ్గిర దాచు. ఈరాత్రి తప్పదు నాకు దేవీ దర్శనము. రేపు పురప్రవేశము.

దేవలత

(భ్రమరతో) చెప్పు మరి.

భ్రమర

నీవే చెప్పు.

దేవలత

పద్మావతి శయ్యపైన వున్నది.

జయదేవుడు

ఆఁ నిజమా ?

భ్రమర

నిజము.

జయదేవుడు

వొస్తాను. (లేచాడు)

భ్రమర

వాస్తవమా ?

జయదేవుడు

తప్పదు.

దేవలత

తన ప్రతిజ్ఞ ?

జయదేవుడు

కనపడని కీర్తికాంత భుజవల్లరులను పద్మావతి బాధ నుపశమ్మింప తుండా ఆటంకపరచనిస్తానా ?

[పాడుతో లేచివెళ్లాడు—స్త్రీలు వెంట వెళ్ళారు. రాణీ, నళినీ వొచ్చారు. చీకటివల్ల యేమీ కనపడదు.]

రాణి

నలినీ, వినబడదేం, ఆ దివ్యమంగళరవము ?

నలిని

నీ ప్రతిజ్ఞ నెరవేరిందిగా ! ఇంక గాన మెందుకు ?

రాణి

జయదేవా ! ప్రియా ! నీ గానోద్రేకంచేత కరిగే నా హృదయ నవనీతాన్ని కాపాడే బధిరత్వము ఆవిరై పోయింది. అభిమాన అధికారచ్యుతనై, నీముందు నుంచున్నాను. అంత గాఢంగా నన్ను కదిలించిన నీ గానవాహిని ఇట్లా యింకిపోయిందేం, యీ అంధకారంలో? కోపమా! ఇంతకాలం శ్రమ పెట్టానని రోషమా ? నీ గీతపు మొదటి స్వరాన్ని వినగానే నా హృదయాంతరాళానికి తెలిసింది నేను నీకు వశ్యమైనానని. ముందు చల్లగా ప్రసరించే కాంతితో ఆకర్షిస్తేనేకాని చంద్రదర్శనమౌతుందా ? నీ కనుచూపు పడడమే మహాభాగ్యంగా యెన్నుకుని పాదాల కింద చెరగుపరిచే సామాన్యస్త్రీజన మమకారానికీ, సామంతరాజ దుహితా శిరోమణిభూషిత పాదారవిందనైన నా ప్రేమకీ తారతమ్యం లేదా ? ఇంక దర్శన మియ్యకూడదూ ? ఏదీ ! ఒక్కసారి నా హృదయాన్ని కంపింపజెయ్యి. తరవాత శిక్ష. సఖీ, వెతుకు.

నలిని

ఆ స్త్రీలు పురానికి పిలుచుకు వెళ్లారుట.

రాణి

ఏమి ? నన్ను. నా రాకను తృణీకరించి....అదంతా హేళనా ? నామీది పట్టుదల ! అంతేనేమో కావలసింది. నన్ను జయించాననే కీర్తిమీద అభిలాషతప్ప వేరుకోర్కె లేదేమో ! కాదు కాదు, ఆ వాక్కులలో ఆ మాధుర్యంలో అహంభావత్వం లేదు. నిరాశచెంది నేనునిర్జీవశిలనని తృణీకరించి వెళ్లాడు, నాకవి,

నలిని

దేవీ, మందిరం లోపలికి దయచేయండి.

రాణి

లోపలికా ! ఎందుకు ? ఆగాన మింకా గోడలమధ్య ప్రతిధ్వనిస్తోనే వుంది. ఎట్లారాను, గాయమైన ఆ కవి హృదయానికి శాంతి నివ్వనిది ! నాపైని, స్త్రీ హృదయంపైన కలిగిన నీచాభిప్రాయాన్ని తొలిగించంది ఎట్లారాను ?

నలిని

మళ్ళీ రేపు రాత్రి వొస్తాడు.

రాణి

రాడు. నీకు తెలీదు. రాడు.

నలిని

నేను పిలుచుకుని వొస్తాను.

రాణి

నమ్మడు. వెక్కిరించ పనుకుంటాడు.

నలిని

ఏమి చెయ్యాలని తమ అనుజ్ఞ ?

రాణి

కవి సార్వభౌముడి హర్మ్యానికి దోవచూపు.

నలిని

హర్మ్యమా ? అది కుటీరము.

రాణి

సరే !

నలిని

నాకు ధైర్యం లేదు,

రాణి

ఛీ! నేను వెడుతున్నాను.

నలిని

తమ పాదాలు రాళ్ళపైని చీలిక లౌతాయి. పల్లకిపైని........

రాణి

లక్ష్యము లేదు. నీవు పో.

నలిని

చులక నౌతారు, ప్రభువులకి, ప్రజలకు మత బాధ్యతను తలుచుకోండి.

రాణి

అవన్నీ తరవాత.

నలిని

తమర్ని ప్రజలు గుర్తించి అడ్డగిస్తారు.

రాణి

నేనింక రాను. నువ్వు లోపలికిపో.



# రెండో రంగం

[గదిలో చాపమీద పద్మావతి కడపటి అవస్థలో పడుకునివుంది. జయదేవుడూ, పురస్త్రీలు దగ్గిర వున్నారు.]

జయదేవుడు

పద్మావతీ!

పద్మావతి

(కళ్లు తెరిచింది) వొచ్చారా! నా పెదవుల్ని తాకండి. నరకజ్వాలల కందనీక మాధుర్యాన్ని దాచుకుంటాను. ఒక్క పాటపాడు. యమలోక బాధల్ని చూసి వెక్కిరిస్తాను, ఆ పాట ప్రతి ధ్వనిలో.

జయదేవుడు

నరక మేమిటి? ఇంతకాలం నీ సంసారాన్ని, ధర్మాల్ని విధుల్ని మరిపించి నిన్ను కట్టివేసిన నాపాటనించి ఈనాడుమాత్రం తప్పించుకోగలదా? రానీ, యమపాశాలను మోహింపచేసి నిద్రపుచ్చుతాను.

పద్మావతి

నీ ముఖారవిందం కనబడకుండా, మృత్యువు తన కాలకుంతలాల్ని కప్పింది, నా కళ్ళనిండా! ఒక్క చెవులే యింకా ఈలోకంవైపు తెరిచి వుంచిన ద్వారాలు. నీ బాహువులకైనా స్థలమివ్వక పెనవేశాడు తన పాశాన్ని.

జయదేవుడు

కళాప్రోత్సాహివి, నా హృదయాధిదేవతవు. నీవులేని ప్రపంచ మేదీ?

పద్మావతి

దుఃఖించకండి. మీగానంకూడా యే నాదాన్ని అందుకో లేక విఫలమై వెనక్కితిరిగి తన వొంపులో తానే మలుపుకునేదో ఆ ఓంకారానికి నృత్యం

చేస్తాను. ఈజడ శరీరరహితనై, యీ భౌతిక భార త్యాజ్యనై, యీ ప్రపంచగోళాలు చేసే ఆకాశగానానికి యీ కాంతి భూమిని వెతుక్కొంటో వొస్తూ వూగే వుషానృత్యానికి అడుగులు నిలుపుతాను. నీనుంచి దూరమైనా ననుకోకు. ఈ నాటినుంచి నీ గానంలో క్రొత్తప్రోత్సాహం కనబడుతుంది. అపుడు నాగొంతు నీతో కలిపి పాడుతున్నాననుకో. ఈ భూమినీ, యీ స్త్రీమోహాన్నీ వొదిలి, నీ గీతాలు నక్షత్రాలలో సంచరించేప్పుడు నాకోసమే వెతుకుతున్నాయని సంతోషిస్తానుగా!

జయదేవుడు

ఇంక గానమా నాకు! నీమూర్తి నా యెదుట నిలవనిది ఇంకగీతా లెవరికోసము పాడను?

పద్మావతి

కొంచెం ముందుగా వొస్తే కడపటి హారతికైనా చేతులు యెత్తగలిగి వుందును. మీ మాటలు దూరమౌతున్నాయి. మీ పెదవుల స్పర్శకూడా నా నరాన్ని కంపింపచెయ్యలేక పోతోంది.

[కళ్ళవెంబడి చుక్కలు చెంపలమీదికి జారాయి.]

జయదేవుడు

నా అపరాధమే! నా చపలత్వమే కారణం. నీ కెన్నోవాగ్దత్తాలు చేశాను. ఇంకే స్త్రీ వల్లనూ ఆకర్షింపబడనని.........నీభర్తను వొదిలి, బంధువులను త్యజించి, లోకాపవాదకుపాత్రై, నన్నే, నా ప్రేమనే నమ్మిన నిన్ను.... పద్మావతీ! ఈపాపకర్ముణ్ణి ఒకసారి కన్నెత్తిచూడు. నిన్ను మరణించనీను. ఒక సంవత్సరము—కాదు....ఒక నెల—నాతో జీవించు. వింతప్రేమను చూపి నా జీవితమంతా నీకు ధారపోసి పరిహారం చేస్తాను. ఒక్కతలపు నీనుంచి వేరుకానీక, ఒక్కచూపు వృధాపోనీక—కాని ఎన్నిసార్లయింది కాదు!—నామాట నమ్ముతుందా? నమ్మితే, ఆ విశ్వాసమేవుంటే నవశక్తి తెచ్చుకుని జీవించేదికాదా? ఎందుకు విశ్వసిస్తుంది! ఈ ఘాతకుడి అనృత

వాక్యాలను! నా ప్రాణమిచ్చి, నాఆయువునిచ్చి ఏ దేవతలూ సహాయం చెయ్యరా ?....ఎట్లా వొదిలి పోయినాను ? పద్మావతిని వొదిలి ఆ అనన్య స్వాధీనయైన ఆ రాణితో పంతమాడి....

ఛీ! పాడుమనసు. నాస్వాధీనం కాని యీ చపలత్వాన్ని. యీ తీవ్ర వ్యాధిని యీ కోర్కెని నిర్మూలం చెయ్యలేని నా బతుకు కాల్చనా ? యీ కళ్లను, యీశరీరాన్ని చెక్కి యీమె చితిమీద ఆహుతి చేస్తాను........

పద్మావతీ! నేను సహగమనం చేస్తున్నాను—నీతో నరకానికిగాని, పాతాళానికిగాని జయదేవుడు ప్రయాణమౌతున్నాడు.

పద్మావతి

(ప్రయత్నంతో) నా హృదయ కవి కిశోరా! ఏమిటీ వెర్రి నీకు ? మీ పాదాలుతాకడానికిమీ మూర్తిని ధ్యానించడానికి—నాకు అర్హత నిచ్చారు. ఏ నరకాన కాలనీ నేను యే మృత్యువులో మునగనీ, మీబాహువులమధ్య మీ గానమాధుర్యంలో నే ననుభవించినకాలం అమృతమయింది. జీవితం ధన్యమయింది. నాకు కావలసిన దేమిటి ? ఈలోకానికి మిగిలిన శృంగార మూర్తి నాతో నశిస్తే యీ స్త్రీ జనమంతా ఎట్లా జీవిస్తారు. ఆ అంధ కారంలో ? సమస్త స్త్రీ హృదయభూషితమైన మీ హృదయా న్నధి ష్ఠించిన నా జన్మము పరమపవిత్రము. ప్రతి అంగము నీ స్పర్శచే పవిత్ర మయింది. దేవత్వాన్నిపొందింది. ఈ మరణము మాయ - లీల.

జయదేవుడు

అవును. నీ మరణము సత్యము కాదు. కానీను. నేను పాడుతో వుండగా నీ ప్రాణము వొదలగలదా యీ శ్రవణాలను ? ఏదీ, నా తంబూర (పాడుతున్నాడు)

పద్మావతి

సఫలమయింది నా జీవితం. దన్యురాలిని. శలవు.

[కళ్ళు మూసుకుంది. స్త్రీలు యేడుస్తున్నారు.]

జయదేవుడు

ఆఁ ఆఁ! మరణమే! పద్మావతీ అహా, వినపడవు ఆ చెవులు— ఎంత అరచినా, ఎంత రోదించినా, ఎంత ప్రేమతో పిలచినా, ఎంత మధురంగా పాడినా-ఎందుకీ పాట!

[తంబుర నేలమీద విసిరి బద్దలు కొట్టాడు.]

పద్మావతీ——ఏవీ నీ చీకటిపాపలు? నల్లని మృత్యువు తనలో లీనం చేసుకుందా? ఈ శరీరాన్ని తన మలిన హస్తాలతో ఆలింగనం చేసుకుందా?

ఎంత కామించి ఎంత అనుభవించినా నా చేతులకందని ఈ సౌంద ర్యాన్ని తను లీనం చేసుకుందా కాలవాహిని! ఆఁ.........ఈ చేతుల్ని! మెల్లిగా నున్నగా నా పెదవుల్ని తాకే యీ వేళ్ల—నన్ను గట్టిగా అదుము కునే యీ జఘనమూ, దీన్ని అగ్నిభస్మం చేస్తాడా! ఏమౌతుంది? ఏమ యింది? ఏలోకాన వున్నాయి ఆ చిరునవ్వు- ఆ లావణ్యము- ఆ మెరుగు- అన్నీ! అంతమా? నశించాయా? సౌందర్యానికే నాశనముంటే యీ ప్రపంచానికే నాశనముంది. ఆ ఈశ్వరుడే నశించాలి. కృష్ణా! కృష్ణా! ఆ పాదాలు! ఏదీ ఆ నాట్యచలనము! ఆకళ! ఆ వుద్రేకం! ఏమైనాయి?

నేను దూరమైనప్పుడు కూడా ఆ పాపలలో నా ప్రతిబింబమే కనపడేది. ఇప్పు డే ముఖాన్ని వీక్షిస్తున్నాయి?

పద్మావతీ! —— నా పిలుపు వినలేదు. చెవులు లేవు —— నా దుఃఖం చూడదు కళ్ళులేవు.

పద్మావతీ, నీకు నేనే దిక్కు. నాకు నువ్వే దిక్కు.

[ఆమె శవాన్ని బుజానవేసుకుని నాట్యం చేస్తున్నాడు. పాడు తున్నాడు.]

నిన్ను పోనీను. వొదలను.

[కింద పారేశాడు.]

ఛా! నాదేంపిచ్చి! ఇదేంపిచ్చి! ఇదేం పద్మావతి!....అబ్బా! పిచ్చి

తల్లీ, పద్మా, దెబ్బతగిలిందా నీకు ? ఏంచేశాను నిన్ను ? చంపాను. నా పద్మావతిని చేతులారా చంపుకున్నాను. నామూలానే! పాదరసంవలె నలుదిక్కుల పరుగెత్తే యీ బుద్ధివల్లనే!

కృష్ణా! కృష్ణా! నిన్ను దూషించాను. దోషిని. నాబుద్దే నా అపరాధాలే నా పద్మావతిని నాశనం చేశాయి. ఏం చెయ్యను ? యీ బుద్దిని కాల్పనా ? చంపనా ? నాబుద్ధిని ఎట్లా కట్టివెయ్యను ? ఎట్లా నాశనం చెయ్యను ? ఈ సంచారం, యీ యిల్లు, యీ స్త్రీలు-నేనింక సన్యాసిని—బైరాగిని—సమస్త వాంఛల్ని కాలుస్తుంది, వైరాగ్యం! నాబుద్ధిని బంధిస్తుంది. నా మనసుని నాశనం చేస్తుంది.

ఎవరు నన్నిట్లాచేశారు ? కాలమా! కర్మమా! శ్రీమన్నారాయణుడా ? కృష్ణుడే! కృష్ణా! నువ్వే నా పద్మావతిని తీసుకున్నది ? ఇంక నిన్నుకీర్తిస్తానా ? ఇంక నటిస్తానా నీముందు ? ఎందు కింక నేను బతికి ? ఇట్లా మధ్యలో జీవనం తియ్యడానికా, నీవు నన్ను సృజియించింది ? నీభక్తుణ్ణి చేసుకున్నది ? వింటున్నావా ? ఏదీ! నా పద్మావతి ? తీసుకురా, ఏం చేశావు? అసలు నువ్వున్నావా ? లేదు. ధూర్తుడా! ఎవరు నాట్యం చేస్తారురా నీ గీతానికి? నీ నర్తకిని రక్షించలేని నీ దైవత్వ మేపాటిదిరా,

పద్మావతిని చూసుకుని విధిని ధిక్కరించాను. విధి నా పద్మావతిని మింగింది. మింగావా, కృష్ణా! ఏడీ ఆ కృతఘ్నుడు ? ఆ వినాశకుడు ఏడీ (కృష్ణ విగ్రహాన్ని పీటనుంచి తీసుకువొచ్చాడు) పో. కనపడకు. పో, నాశనమైపో (వీధులో పారేశాడు) కుక్కల పాలై చావు. నీ వినాశ గీతాల్ని పాడతానింక.........

పద్మావతీ, నీతోకూడా నా స్త్రీవాంఛని భస్మం చేస్తున్నాను. నేను సన్యాసిని. ఇంక యే స్త్రీనీ యీ హస్తాలు తాకవు.

[బట్టలు విప్పేశాడు.]

పోండి, బంధనాలూ పోండి.

[కాలిగే కొరవితీసి యింటి చూరు ముట్టించాడు.]

ఆహుతి. ఆహుతి. సమస్తమూ ఆహుతి. నా కలలు నా సౌందర్య వాంఛ నా రసికత్వం అంతా ఆహుతి చేస్తున్నాను. నా కొత్తగీతాలూ నా తాంబూరా అన్నీ. పద్మావతీ దహనసంస్కార మిది. రండి, రండి, జయదేవ పద్మావతుల సహగమనం చూడండి—ఇంక జయదేవుడు లేడు—బైరాగి—సన్యాసి.

[తగలబడే యింటి బూడిద పులుముకొస్తాడు.]

మిత్రులారా! శలవు. మీ కన్నీళ్ళకి మీ సౌందర్యానికి అన్నిటికీ నా వందనాలు. మీరందరూ నా తల్లులు. నా నమస్కారం—పొండి కనబడకండి.

మదాలస

గురూ! మీ గీతాలు వినక....

లాలస

మీ పాదసేవ లేక........

జయదేవుడు

వొద్దు....నా మనోనిశ్చయం చెడగొట్టవొద్దు. పాపిని, నన్ను వొదిలి పోనీండి,

భ్రమర

మీ కూతురు....ఏడుస్తోంది. ఆమె వివాహం.... ....

జయదేవుడు

నాకూతు రెవరు? నే నెవరు? వివాహ మేమిటి? నేనుబైరాగిని.

దేవలత

మా యింటికి బిక్షకు రండి.

జయదేవుడు

ఇంక అడవుల్లో నా భిక్ష— పరదేశాల్లో నివాసం—పొండి.

[రాణి ముసుగు పెట్టుకొని వొచ్చింది.]

రాణి

ఏమిటిది? జయదేవచంద్రుడేనా, యీ బూడిద మబ్బుల్లో.........

జయ దేవుడు

ఎవరు? ఎవరిదా కంఠం? పూర్వజన్మలోంచి కలలుకన్న యీమార్దవత్వం నా హృదయాన్నెట్లా బాధిస్తోందో! పద్మావతీ! నా పద్మావతీ, ఈజ్వాలల్లో భస్మమై, నవజీవనాన్ని పొంది నాకోసం వెతుకుతున్నావు— అవునా?

[రాణిని కౌగలించుకున్నాడు.]

రాణి

నీ పాదదాసిని, జయదేవ కవీ........

జయ దేవుడు

జయదేవుడా? లేడు. మృతుడైనాడు. నేను జయదేవ పిశాచిని.

రాణి

నా హృదయాధి దేవతవు.

జయ దేవుడు

కాను—ఈ మనోజ్ఞస్వరం యీ భస్మలేపాన్ని చీల్చుకుని నా హృదయాన్ని కలత పెట్టుతోంది. నా శపధానికి భయపడి యముడు నా పద్మావతికి నూతనరూపాన్నిచ్చి పంపాడు. కాదు — పద్మావతి కాదు— పూర్వసివా? మారుపలకవేం? నన్ను మోసగించగలవా నీవు? ఇది జయదేవుడి ధీరహృదయం పో............(తోసేస్తున్నాడు)

రాణి

(నవ్వుతో ముసుగు తీసి) నేను.........ఎవరికోసం నాలుగు అహో రాత్రులు నువ్వు గానతపోనిష్ఠాగరిష్ఠుడైనావో ఎవరి ముఖారవిందాన్ని

పతితప్ప ఇతరులు కన్నెత్తి యెరగరో....ఆ గర్వితమతి మహారాజ్ఞి నీ ముందు మోకరించి కాలయాపనకై శిక్షించమని వేడుకుంటోంది.

జయదేవుడు

రాణీ!

అందరు

రాణీ!

రాణి

అవును. ఆ సర్వ అభిమానాన్నీ అధికార గర్వాన్నీ లజ్జనూ త్యజించి, నీకోసం, నీ ప్రేమకోసం నీ ముందు మోకరిస్తున్నాను. ఎంత ప్రయత్నించి విముఖినైనా నా స్వాధీనం తప్పి నా హృదయం ఈడ్చుకొని వొచ్చింది నన్ను నీ పాదరేఖలవెంట.

జయదేవుడు

రాణీ! నా హృదయరాజ్ఞీ! నీ తెల్లటి నుదిటిమీద పడే యీ నల్లటి కుంతలాలకోసం కార్తీకపు ఆకాశపు నునుపును ధిక్కరించే నీ మెడ కింద నునుపు కోసం మధ్యాహ్నపుకొండ నీడల చీకటులవంటి నీ వక్షపుఛాయల కోసం నే నెంత తపించాను— ఎన్ని గీతాలు కీర్తించాను. (కౌగలించు కొన్నాడు) ధన్యమయింది నా జీవితం.

సువర్ణముఖి

సఖా! పద్మావతి అంగుళీయం మాత్రమే మిగిలిందియీ బూడిదలో.

జయదేవుడు

పద్మావతి! ఏది? అంగుళీయ. మంపిందా?—ఆఁ! కాదు—పద్మావతీ—నా పద్మావతీ! (విచారిస్తున్నాడు)

రాణి

ఎందుకా విచారము ? నా ముఖంవంక కనులనెత్తి చిరు నవ్వు రానీ! పద్మావతీ విరహభారమైన నీ హృదయ బాధను నా వక్షంమీదచల్లార్చుకో.

జయదేవుడు

రాణీ! జయదేవుడు సహగమనమైనాడు. పద్మావతిచితిలో ఆహుతైనాడు. జయదేవుడు లేడు. బైరాగి, దేశసంచారి—నీకెందుకు తిరిగిపో.

రాణి

నా హృదయ నాథుడవు. నాకింక వెనకతోవలేదు. నా గవాక్షము నించి జారిన నిచ్చెన తాళ్ళను తెంచి వచ్చాను నీ పాదారవిందాల కిందకి. నన్ను కూడా నీ వెంట తీసుకుపో జడదారిని చేసి.

జయదేవుడు

(తనలో) ఆఁ! ఆఁ! జారుతున్నావు! మనసా! మళ్ళీ వాంఛలో. మళ్ళీ స్త్రీ మాయలో పడుతున్నావు. జాగ్రత్త!!

రాణీ! జయదేవుడు సన్యసించాడు. శలవు.

[వెనుక చూడక పరుగెత్తుతాడు.]

# మూడో రంగం

[కాశీపట్నంలో బ్రాహ్మణగృహము. రాత్రి అయింది. జయదేవుడు దొడ్లో వ్యాఘ్రాసనంమీద కూచున్నాడు. సువర్ణముఖి పని చేసుకుంటూంది.]

జయదేవుడు

ఛీ. యతిని.

సువర్ణముఖి

స్వామీ ! ఏమి ఆజ్ఞ.

జయదేవుడు

ఏమీలేదు నేను యతి నని జ్ఞాపకం చేసుకుంటూన్నాను.

సువర్ణముఖి

ఎందుకు?

జయదేవుడు

మాయలోకి జారిపోతానని భయంవల్ల.

[పాడుతున్నాడు.]

సువర్ణముఖి

స్వామీ, నేనుకూడా మీరు యతులని మరిచిపోతున్నాను.

జయదేవుడు

(సంతోషముతో) ఏమి ?

సువర్ణముఖి

మీ గానం వింటే యతియేమిటి, ఆ శృంగారగీతమేమిటి అనిపించింది. ఆహా, యేమి మాధుర్యం ఆ కంఠంలో ! ఇంకా పాడండి,

జయదేవుడు

నీ ఆజ్ఞ అయిందా, నిరంతరమూ యీ శరీరం శిథిలమయిందాకా

ఇట్లానే యీ మూలనే పాడతాను. తదనంతరమైనా యీ కంఠం మిగిలి నీ పాదాలవద్ద గానం చేస్తోనేవుంటుంది.

సువర్ణముఖి

అంతభాగ్యమా నాకు!

[పాడుతున్నాడు.]

సువర్ణముఖి

స్వామీ! మీగీతాలు వింటే నేనా రాధనై జన్మించి వుండకూడదా అని కలకంటున్నాను. ఎవరు ఆ గీతాన్ని రచించింది?

జయదేవుడు

నేనే.

సువర్ణముఖి

తమరా!

[ఆశ్చర్యపడుతోంది.]

జయదేవుడు

ఏమి!

సువర్ణముఖి

యతి! ఎంత రసికత్వం, ఎంత నిబిడమైన సౌందర్యారాధన! ఎందుకైనారో యతి!

జయదేవుడు

యతినికాకుంటే నీకు సంతోషమా?

సువర్ణముఖి

అవును.

జయదేవుడు

ఏమీ?

సువర్ణముఖి

ఏమో! ఆ గానానికీ, మీ రూపానికీ, నా మనసులో సందర్భపడటం లేదు. పాడండి.

[పాడుతో ఆమెవంక చూస్తున్నాడు. ఆమె యిబ్బంది పడి వెళ్ళిపోతుంది.]

జయదేవుడు

గృహిణీ!

[ఆ పిలుపుకి ఆమె ఆశ్చర్యపడ్డది]

సువర్ణముఖి

ఏమి ఆజ్ఞ?

జయదేవుడు

ఎందుకు వేడుతున్నావు?

సువర్ణముఖి

ఆగ్రహించకండి. ఎందుకు నా వంక అట్లా చూస్తారు? నాకు భయం కలుగుతోంది.

జయదేవుడు

నేను చూస్తూన్నానా? నేను కాదు. నా చక్షువులు నాకు విరోధులైనాయి. నా ఆజ్ఞను అతిక్రమించే యీ సేవకుల్ని శిక్షించాలి.

[కళ్లు మూసుకున్నాడు.]

నాకు బుద్ధిలేదు. వెళ్లు.

[పాడుతున్నాడు. ఆమె అక్కడనే వున్నదని అతనికి తెలీదు.]

వొద్దు. వొద్దు. నా మాటవిను. శృంగారబంధనాల్లో చిక్కుకోకు. మాట వినవా, ఆజ్ఞని తిరస్కరించి........

సువర్ణముఖి

(భయంతో) ఏమి అపరాధం నావల్ల?

[జయదేవుడు ఆశ్చర్యంతో కళ్లు తెరిచి చూశాడు.]

జయదేవుడు

నిన్నుకాదు.

సువర్ణముఖి

అపరాధం బుద్ధిపూర్వకం కాదు క్షమించండి. (నమస్కరిస్తోంది)

జయదేవుడు

ఛీ!

[ఆమె చేతులు పట్టుకుని, చప్పున వొదిలాడు.]

(కోపంగా) వెళ్ళు. వెళ్ళు. నాకు కనపడక వెళ్ళు.

సువర్ణముఖి

కనికరించిన దాకా కదలను.

జయదేవుడు

ఎన్నడూ కనికరించను .... అయితే.... .... నన్ను వొదులు. నన్ను సమాధిలో వొదులు.

సువర్ణముఖి

వెడతాను. తమకి అక్కడ పక్క వేస్తాను.

జయదేవుడు

వొద్దు. ఆ సంపెగ పొద దగ్గిర వొద్దు. ఎట్లా వికసించాయో చూచావా, ఆ పుష్పాలు! వాటి సుగంధం నిన్నే జ్ఞప్తికి తెస్తుంది. చల్లగాలి వేస్తుందా అక్కడ?

సువర్ణముఖి

ఆ. చాలా సుఖంగా నిద్రపడుతుంది.

జయదేవుడు

అక్కడవొద్దు. నాకు నిద్రపట్టదు.

సువర్ణముఖి

గాలిలో నిద్రపట్టదా?

జయదేవుడు

చల్లనిగాలి కాలుస్తుంది. నిన్ను కాల్చదా?

సువర్ణముఖి

విరహుల్ని కాలుస్తుంది. మీరు యతులూ, నేను పత్నిని. మనకేమి?

జయదేవుడు

నేను నిరంతర విరహుణ్ణి.

సువర్ణముఖి

అవును. యీశ్వరుణ్ణించి. కాని గాలిలో యీశ్వరుడున్నాడుకదా!

జయదేవుడు

వాడు పురుషుడు—

సువర్ణముఖి

(అర్థంకాక) గది లోపల తమకిశయ్య అమరుస్తాను.

[వెడుతోంది.]

జయదేవుడు

వెళ్ళకు—(తనలో) నీ నాలిక కాలిపోవాలి. నీకు వినాశకాలం సమీపించింది.

సువర్ణముఖి

ఏమిటది? [ఆమె వెళ్ళింది, అతనికి వెర్రి అనుకుంటో.]

జయదేవుడు

పరమ ద్రోహిని. సన్యాసినైనా, సర్వసంగ పరిత్యాగినైనా, ఏమిటీ ఆకర్షణ! ఈ స్త్రీ సౌందర్యం నన్ను పిశాచివలె పీడిస్తోంది. ఏ మంత్రం,

యేతపం నన్ను రక్షిస్తుంది యిప్పుడు? యేపురాకృతంవల్ల యీ వ్యసనంలో తగుల్కొన్నాను తిరిగి? అన్నీ త్యజించినా, ప్రతి దిక్కునా యీ లావణ్య మెదురౌతోంది. ఈ జాడ్యం బాహ్యం కాదు, మనోగతం. నా మనస్సులో, నాహృదయంలో, ఆ భాగాన్ని వేరుచేసి కాల్చలేనా?

గంగాతీరాన నిశ్చల సమాధిలోవున్న నన్ను యీ బ్రాహ్మణుడు అతిధిగా రమ్మని, యే దుర్దేవతా ప్రేరేపణ వల్ల ప్రాధేయపడ్డాడో! తన దేవలోక పీఠాన్నించి, నా తపశ్శక్తిచేత భ్రష్టుణ్ణి చేస్తానని భయపడి దేవేంద్రుడు పన్నిన మాయ యిది.

జయించి తీరతాను—చాతకాదు. ఈ సౌందర్య మెదురైనంతకాలం నాకు శక్తిశూన్యం. పలాయన మొక్కటే విజయమార్గం.

[లేచి గుమ్మంలోకివచ్చాడు. సువర్ణముఖి యెదురయింది.]

సువర్ణముఖి

ఎక్కడికి?

జయదేవుడు

(నిస్పృహతో) మళ్ళీనా! ఎందుకు ఎదురైనావు? ఎట్లావెళ్ళను?

సువర్ణముఖి

యేమిటీ అపచారం? యేకారణంవల్ల నా దర్శనమే హేయమయింది తమ నేత్రాలకు?

జయదేవుడు

గృహిణీ! నీవు లోకాతీతమైన లావణ్యవతివని నీకు తెలుసునా?

సువర్ణముఖి

నేనా? నే నేమిటి?

జయదేవుడు

దగ్గిరకిరా....వొద్దు....మూర్ఖుడా, యతివి నీవు....ఇంకా....దగ్గిరిగా. ఇట్లా అనుకో.

[స్పర్శసుఖం అనుభవిస్తున్నాడు.]

అట్లానే నిలుచో. కదలకు. దగ్గిరిగా—ఇంకా,

సువర్ణముఖి

ఏమిటి స్వామీ !

జయదేవుడు

ఏమీలేదు. ఈ నీచజీవిని తాకకు....కదలకు....ఛీ ఛీ ఏమి జన్మయిది ? నీ పేరేమిటి?

సువర్ణముఖి

సువర్ణముఖి. సువర్ణముఖి.

జయదేవుడు

సువర్ణముఖీ ! నన్నానంద పెట్టవా?

సువర్ణముఖి

సర్వశక్తులతోటీ !

జయదేవుడు

కదలకు. ఆనందమా?

సువర్ణముఖి

నాకా? నా కెందుకు ఆనందం? తమ అనుగ్రహంకావాలి.

జయదేవుడు

ఎందుకు నాపైని ఈ కరుణ?

సువర్ణముఖి

కరుణా? కరుణ యేమిటి? తమ కరుణకోసమే కదా భర్త నన్ను నియోగించింది.

జయదేవుడు

చూడు. నాకు ఏమి వాంఛ? నా వాంఛ యేమిటంటే—మాట్లాడకు. నీచుడా. అయిపోయింది. నీ పని ముగిసింది జయదేవా?....నాకు వాంఛ ....యేమంటే.

[ఆమెని కౌగిలించుకున్నాడు.]

సువర్ణముఖి

ఏమిటిది? హాస్యమా?

జయదేవుడు

ఛీ, తగనిపని,

[ఆమెని వొడిలి పక్కమీద కూచున్నాడు. అతను పిచ్చివాడేమోనని ఆమె భయపడి చూస్తోంది.]

ఇట్లారా. ఇక్కడ కూచో. కూచో. ఆజ్ఞనతిక్రమించకు.

[ఆమె వెళ్ళికూచుంది. ఆమెచేతుల్ని పైదాక పట్టుకున్నాడు.]

సువర్ణముఖి

ఏమిటిది? హాస్యమా? పరీక్షా? అనవసరం. నేను మనో వాక్కాయకర్మలా పతివ్రతని.

జయదేవుడు

నిజమా?

సువర్ణముఖి

భర్తే నా దైవం.

జయదేవుడు

నిజమా!

[ఆమె వంక చూస్తున్నాడు.]

నాకు వొకటే కోర్కె—అవును, నిజంగా నువ్వు పతివ్రతవు. అమాయకురాలివి. నేను దోషిని. దుర్మార్గుణ్ణి (అరుస్తున్నాడు) నేను వెడతాను. నన్నాపకు. నన్ను రక్షించు. నేను పిశాచిని. నీ పాదాల మీద పడి వేడుకుంటున్నాను (లేచాడు)

సువర్ణముఖి

వీలులేదు. అది నాశక్తిలోలేదు. వెళ్లవొద్దు. భర్తకి ఆగ్రహం కలుగుతుంధి నామీధ,

జయ దేవుడు

నా ఆశ అనంతం. నా వాంఛలు విపరీతమైనవి.

సువర్ణముఖి

మా సర్వమూ మీదే కద!

జయ దేవుడు

నువ్వు! నీ దేహము!

సువర్ణముఖి

భక్తి, సేవ.

జయ దేవుడు

కాదు. నాకు ప్రేమ ధనం కావాలి. నేను కపటయతిని. ఈ పవిత్ర ద్వారాన్ని ప్రవేశించేందుకు నాకు అర్హత లేదు. పోనీ నన్ను!

సువర్ణముఖి

ప్రేమిస్తాను. ఏది? పాడండి ఇంకోసారి, నాహృదయం అర్పిస్తాను.

జయ దేవుడు

కాదు. నీనించి మోహము....

సువర్ణముఖి

తమకా? యతులు, మీకు? హాస్యం. ఈ శూద్రురాలినించి మోహమా! శరీరాన్ని ఆశిస్తున్నారా? అబద్ధం.

జయ దేవుడు

అవును....నాశనం....సర్వనాశనం.

సువర్ణముఖి

లేదు. ఇదేదో పరీక్ష.

జయ దేవుడు

కాదు.

సువర్ణముఖి

నేను పతివ్రతను.

జయదేవుడు

చూడు. నీకు భర్త లేకపోతే నేను అంగీకారమా?

సువర్ణముఖి

కాదు. మీరు పరపురుషులు. నా మనస్సు చలించదు.

జయదేవుడు

వెళ్లు. వెళ్లు.

సువర్ణముఖి

మీరు వెళ్ళరు కద!

జయదేవుడు

వెళ్ళు.

[సువర్ణముఖి వెళ్ళింది.]

నిరాకరించింది. తృణీకరించింది నా ప్రేమని, నన్ను.........నిరాకరించింది. జయదేవుడా! నిన్ను. నీ బతుకు కాల్చనా! సాధారణ గృహిణి ముందు న్యూనత నొందావు. ఎట్లా భరించను? సిగ్గు! సిగ్గు! కాని యతికి గౌరవ మేమిటి? ఈ క్షుద్రయతికి! సరస్వతికి తుల్యమైన సాహిత్యవతులు, మహారాజ్ఞులు సత్కరించిన నన్ను తృణప్రాయంగా నిర్లక్ష్యం చేసింది! వెళ్ళనా? ఎట్లా వెళ్ళను? ఆ సౌందర్యం, ఆ గర్వం! ఇక్కడ కూచుంటే, నా పక్కన, కంఠం వొంచి కిందికి చూస్తో కూచుంటే కదిలే చేతులతో యీ గది నంతా కాంతితో నింపించి....వెళ్ళను. ఆమె స్వాధీనమైనా కావాలి .... నాశనమైనా కావాలి. ఛీ....స్త్రీపాద తాడిత కళేబరంయిది! జయదేవా, ఎంత పతితుడివైనావు!

(కోపంతో) ఇదే. యీ స్త్రీ వాంఛ, యీ సౌందర్య వాంఛ ఇదే నిన్నీగతికి తెచ్చింది. నేనింక నిలువను ఇక్కడ........

(వెడుతున్నాడు. ఎదురుగా సువర్ణముఖి వొచ్చింది.)

---

# నాలుగో రంగం

[రాత్రి పది గంటలు. అయింటోనే గదిలో, పక్కదగ్గర జయ దేవుడూ సువర్ణముఖీ.]

జయదేవుడు

స్త్రీలోక విజయుడు, రసికావతంసుడు, జయదేవుడు నీముందు మోక రిస్తున్నాడు. స్త్రీ సుఖం వర్జించి సన్యాసినైన నేను నీసౌందర్య ప్రభావం వల్ల సమస్తనియమాలనూ త్యజించి నీ పాదాల దగ్గిర 'భవతి భిక్షాం దేహి' అని ప్రాధేయ పడుతున్నాను. ఇన్నేళ్ళ వ్యర్థంగా బతికావు, యీ గృహంలో, నాకోసం యెదురుచూస్తో....సంశయించకు. నా చాతు ర్యమూ, రసికత్వమూ, అనుభవించావా, నీ వింక నాకు జన్మ దాసీ వౌతావు. నా ప్రభావాన్ని నీ వెరగవు. నన్ను సామాన్య తుచ్ఛ కాము కుణ్ణిగా చూడకు........

సువర్ణముఖి

విరాగివి, సన్యాసివి. నీకు ప్రణమిల్లుతున్నాను. ఇదివిపరీతము స్వామీ.

జయదేవుడు

ఈ కాషాయ వస్త్రాలను సహితం మోహ పులకాంకితం చేస్తున్న నీ ప్రతిభను వ్యర్థం చేసుకోకు. గర్వించు. కళ్ళల్లోని ఆశ్చర్యాన్ని కిందికి జార్చి, చిరునవ్వుతో మెరుగైన నీ బాహువుల్ని నాపైకి జాచు.

సువర్ణముఖి

నే నవన్యస్ప్రశ్యను. నీ మీద కించి దనురాగమైనా లేదీ మనసులో! ఎందుకీ వృథా ప్రసంగం! సంయోగం కాని హృదయంలో, యీ శృంగార వాక్యాలెంత హాస్యాస్పదాలుగా ధ్వనిస్తాయో యోచించుకో! ఇంత అభి మానశూన్యుడవా?

జయదేవుడు

ఏదీ. ఆ తృణీకారం! ఆహా! నే నింక భరించలేను.

[ఆమెను కౌగలించుకున్నాడు! ఆమె పెనగులాడుతోంది.]

సువర్ణముఖి

అయ్యో! ఇదేమి పాపము! నేను సుశీలను.

జయదేవుడు

జయదేవుడి అనుగ్రహాన్ని పొందినవారు శీలం నష్టపడ్డదని సంకోచించరు.

సువర్ణముఖి

(బిగ్గరిగా బైట వున్న భర్తతో) చూడండి. ఈ యతి నన్ను కామించి సమీపిస్తున్నాడు.

[బైటినుంచి భర్త]

ఛా. నీవు వృథా అనుమానిస్తున్నావు. ఆయన పరమ పవిత్రులు.

జయదేవుడు

పాపమీబుజాలెట్లా పావురాలవలె కంపిస్తున్నాయో! ఇట్లా శాంతిని పొందు.

సువర్ణముఖి

ఈయన....నన్ను....అక్రమంగా ప్రవర్తిస్తున్నాడు. నేనోర్వను.

జయదేవుడు

నే నోర్వగలనా? నా వేళ్ళనించి నీస్తనాగ్రాలకి విద్యుచ్ఛక్తి యెట్లా పరుగు లెత్తుతోందో! చూడు! నేనా చకోరాల అంగీకారాన్ని పొందాను. ఏదీ చూపులతో, ముద్దులతో సత్కరించనీ.

సువర్ణముఖి

ఛీ! స్వామీ. న న్ననుగ్రహించండి.

జయ దేవుడు

అవును. రా. నీవే నన్ననుగ్రహించు. నీవు నా యీశ్వరివి. నా మోహామృతముతో అభిషేకించనీ.

సువర్ణముఖి

కాదు. కాదు.... నేను నాభర్తకు క్షుద్రదాసిని.

అయ్యో! యీ దుర్మార్గుడు....అయ్యో నీ చేతులు....ఎంత బలమబ్బా! అబద్ధం కాదు. వీడు కపటయతి! నిన్నింతవరకు సన్యాసివని, పూజ్యుడవని సహించాను....వొదులు....అబ్బా!

జయ దేవుడు

ఏది, ఆ మధురమైన బాధారవము!

సువర్ణముఖి

తులువా! నీచుడా!

[బైటికొంచి భర్త]

నీకు మతిపోయిందా? అదేమిటి ఆ మహా పురుషుణ్ణి దూషిస్తున్నావు? ఎంతో నా ప్రార్ధనపైన, మన గృహాన్ని పావనం చేయ వొచ్చిన పవిత్ర యోగికి చిత్తక్షోభ కలిగిస్తున్నావు. పాపీ.

[ఆమాటలతో నిశ్చబ్ధమైన ఆమెని జయదేవుడు లోబరచుకుంటున్నాడు.]

సువర్ణముఖి

ఇదేమి విపరీతమైన ఆతిధ్యం! అబ్బా! వుండు....(బైటికి) మిమ్మల్నొకసారి చూడనీండి....వీడు నన్ను....తలుపు తెరవండి....అబ్బా. నేను పతివ్రతను. వొదులు....వొద్దు. ..అట్లావొద్దు....వేడుకుంటాను. నన్ను రక్షించు....నన్ను పేక్షించు....అయ్యో! వినడు....(బైటికి) మీకు సిగ్గులేదా? మీ భార్యని వీడనుభవించపోతున్నాడు. ఇంక మీకు భార్య వుండదు.

[బైటనుంచి భర్త]

నీ సౌందర్యం ఆ మహాత్ముల దృష్టి నాకర్షించడ మనేదే. అసాధారణ భాగ్యం మనకు, మాట్లాడకు. ఆయన్ని సంతుష్టిపరుచు.

సువర్ణముఖి

ఏదేవతలూ....అనుగ్రహించరా? పతి ఆజ్ఞ.... ఏది దిక్కు! ఈ పాపాత్ముడు భస్మమైనా కాడే!

జయదేవుడు

ఎవరూ తప్పించరు. సౌందర్యం పురుషుడి హక్కు. రసికత్వం నశించిందా లోకంలో! ఇది మహా కళ్యాణ సమయం. చేతులు అడ్డం తియ్యి. నాచూపులవల్ల ఆరాధించ పడడం కన్న నీ దేహానికి మహాభాగ్యమేముంది? జయదేవుడి హస్తాలు స్పృశించినభాగాలన్నీ శాశ్వతత్వాన్ని పొందుతాయి కళా ప్రపంచంలో. వ్యర్థమైన యీ నిరాకరణ మెందుకు? నీవానందపడు. నన్నానందాబ్ధిలో ముంచు.

[అతని చేతుల్లో సోలిన ఆమెని పక్కదగ్గిరికి తీసుకుపోతున్నాడు. వెలుతురు తగ్గింది.]

సువర్ణముఖి

మహాత్మా! నీ పాదాల మీదపడి వేడుకుంటున్నాను. ఆజన్మాంతమూ నీకు కృతజ్ఞురాలిని. నీవంటి రసికుడికి, లోకమంతా వేనకువేలు అతిసుందరులు ఆరాధించే వాళ్లుంటారు. నేను క్షుద్రురాలిని. తమ కెందుకు? అయ్యో!....వొద్దు. నేను బతకను. పాపం, ఘోరం, నేను భరించను.

జయదేవుడు

నాకీ ప్రపంచంతో ప్రసక్తియేమిటి? యతికి? నీవే నాప్రపంచం, యీ శరీరమే....సమస్త సౌందర్యాలూ, శోభలూ, యిందులో దాక్కున్నాయి. ఆహా! యీ కోమలత్వం, యీ మృదుత్వం, యీ చీకటినీడలెట్లా తేలుతున్నాయో, యీ నిర్మల శిలోన్నతాల మీద! ఈ స్పర్శదేహానికి వర్ణవి

గాలిలో పచ్చకర్పూరపు పూతలాగున్నది. నీ నిగ్రహమే యింత రమణీయమైతే నీ అనుగ్రహమెంత అమృతమో!....లాభంలేదు. నన్నెంత బాధించి నిరాకరించినా ఈ మహాకర్షణలో, ఈ ప్రేమోద్రేకంలో, నన్ను గాయపరచలేవు. ఇంకా....ఈ వుద్రేకమంతా నాపైని వాంఛవల్ల నేనని భ్రమలో నిమగ్నుణ్ణి కానియ్యి. మాట్లాడకు. మోహమతీతమైనా, క్రోధమతీతమైనా ఒకటే విధం నాట్యం:

[మాటలులేవు. జయదేవుడి గళంలోని సగం వుచ్చరింపబడ్డ సంతుష్టి ధ్వని. సువర్ణముఖి ద్వేషం మెల్లిగా సౌఖ్యంలోకి మారుతున్నట్టు సూచించే అవ్యక్త కంఠరవాలు...

దీపకాంతి హెచ్చుతోంది. మెల్లిగా సువర్ణముఖి యేడుస్తోంది. జయదేవుడు సిగ్గుతో మంచంపక్కన నుంచున్నాడు.]

జయదేవుడు

ఏడవకు. నీ వేడిస్తే నా ప్రతిరక్త బిందువూ నన్ను ద్వేషిస్తోంది. బాధించానా? కాని ప్రేమ యెంతమధురమో, అంత తీవ్రము. పశువును! సన్యాసిని! నేనేనా? ఎంత శృంగారం మాట్లాడగలిగాను! సర్వమూ త్యజించి యెడారి మార్గాలపడ్డ నాలో యెక్కడ దాపక దాక్కుంది ఈ కామవాంఛ? ఛీ! ఛీ! ఏ రాక్షసుడన్నా నాలో ప్రవేశించాడా? కాదు. నేనే రాక్షసుడు! నా గుణమే అధమం!....ఒక్క చూపుతో, ఒక్క సుందర స్త్రీ దర్శనంతో, ఆ జుట్టు—స్నానముచేసి అప్పుడే ఆరుతున్న పరిమళమైన కేశభారాన్ని చూసి—ఆమె గంగాజలంలో కడవముంచి యెత్తేప్పటి భుజాల వొయ్యారాన్ని, తడిబట్టలోనుంచి కనపడేపిరుదుల నవనవని చూసి—ఛీ, ఇదేమిటి? నా మనస్సిట్లామారిపోయింది....ఇంత పైశాచిక స్వభావమా? ఆ వొక్కదర్శనంతో ఇన్నాళ్ళ తపస్సూ, నిగ్రహము సర్వము నుంచీయిట్లా భ్రష్టుణ్ణయినాను. సువర్ణముఖీ! నువ్వు అమితమయిన పాపాని కొడిగట్టావు. యతిని తపోభ్రష్టుణ్ణిచేసి వొదిలావుకద! ఇక నాకేమి శరణ్యం?

సువర్ణముఖి

ఛీ. మాట్లాడకు.

జయ దేవుడు

ఏం పరిహారం చెయ్యను?

సువర్ణముఖి

నశించు. గంగానదిలో అంతమైపో,

జయ దేవుడు

పోయి.... పోయి.... పరలోకమంతా స్త్రీలే గదా!

సువర్ణముఖి

పో, అంతమైపో. ఈ లోకంనించే నిష్క్రమించు. ఇతరస్త్రీ జనానికన్నా ముక్తి కలుగుతుంది. నాకళ్ళముందు ఇక్కడే ప్రాణత్యాగం చెయ్యి. నాకే శాపదక్షత వుంటేనా? కాని ఎందుకు? ఎందుకు? పోయింది, అయి పోయింది. నా శీలం.... నా........

జయ దేవుడు

క్షమించు. నా తపస్సు.... నా యజనం.... అంతా....

సువర్ణముఖి

క్షమించనా, నిన్ను ద్రోహీ?

జయ దేవుడు

ఇంక కనిపించను. నా కృష్ణాజినమేది?

సువర్ణముఖి

వెడుతున్నావా? నన్ను.... నన్ను! అవును. ఇంక నేను నీ కెందుకు? వెళ్లు.

జయ దేవుడు

అంతకన్న నే నేమి చేయగలను? ఏ పరిహారం....

సువర్ణముఖి

వీల్లేదు. నువ్వు స్వేచ్ఛగా, నన్ను మరిచి, నాకు చేసిన అపచారాన్ని ఇక్కడే వొదిలి వెళ్ళడానికి వీల్లేదు.

[పక్క మీదనించి లేచి కూచుంది. విచారం మానివేసింది.]
నావంక చూడకు. నిజంగా చెప్పు. నీవు నిజమైన యతివేనా?

జయదేవుడు

అవును. ఏమి?

సువర్ణముఖి

కాదు. నాకు తెలుసు. అబద్ధం.

జయదేవుడు

కాదు. ఏమి?

సువర్ణముఖి

యతికి, రుషికి, యీ గానం, యీ అద్భుత రతిచాతుర్యం వుండవు. అవునా?

జయదేవుడు

ఆనందం....కాని ఆ రసికత్వమే నన్ని అధోగతికి తెచ్చింది.

సువర్ణముఖి

ఎంతైనా, నీ తపస్సు పోయిందని విచారమేకాని, పతివ్రతను, అబలను, స్త్రీని, నన్ను........

జయదేవుడు

నిజము! క్షమించు.

సువర్ణముఖి

నీవు స్త్రీలోలుడివా?

జయదేవుడు

సన్యసించిన తరవాత కాదు.

సువర్ణముఖి

మరి యీ దౌర్జన్యమేమిటి? నా దౌర్భాగ్యమా?

జయదేవుడు

నీ అనన్య సాధారణ లావణ్య ప్రభ.

సువర్ణముఖి

నా లావణ్యమా! నా లావణ్యమా? నిన్ని దారుణపాతకానికి బలిచేసింది, నా లావణ్యమేనా? (ఆలోచిస్తోంది.)

ఎక్కడ? ఈ శరీరంలో యే భాగం ఆకర్షణీయమయింది నీకు?

జయదేవుడు

ఎట్లా చెప్పను? పద్మంలో సౌందర్యమూ, సౌరభమూ పుత్పత్తియెక్కడో యెవరు నిర్ణయించగలరు? నీ చంపలు, నీ పెదవులు, నీ శరీరతేజస్సు.

సువర్ణముఖి

నా సౌందర్యమా నా శీలాన్ని మింగింది, నీ వ్రతభంగం చేయించింది?

[దీపం దగ్గిరికి వెళ్ళి ఆ మంటలో చంపల్ని ఆనిస్తోంది.]

ఈ సౌందర్యమేనా? ఈ చంపల నునుపేనా? ఈ పెదవుల్ని అగ్నికి అర్పిస్తాను. (దీపాన్ని ముద్దుపెట్టుకుంటోంది.) రా, ఆనందించు. ఇప్పుడు ముద్దుపెట్టుకో నన్ను.

[జయదేవుడు విభ్రాంతుడై ఒక్క నిమిషం కదల లేడు.]

జయదేవుడు

ఏమిటది?

[ముందుకి పరుగెత్తుతున్నాడు.]

సువర్ణముఖి

ఆగు. అక్కడే. ఇదే ప్రాయశ్చిత్తం. ఇదే పరిహారం,

[కాల్చుకుంటోంది.]

జయదేవుడు

నీవేమి పాపం చేశావని యీ పరిహారం?

సువర్ణముఖి

నేనూ ఆనందించాను. నీకు తెలీదా? ఇంక యీనాటినించి యేపురుషుడూ వాంఛించడీ కళేబరాన్ని.

[జయదేవుడు ఆమెను దూరంగా లాగాడు.]

జయదేవుడు

పశువును, నే నేం చేశాను? అయ్యో! యెంతంతగాయాలో! ఇదంతా, నావల్లనే-ఈమె సౌందర్యమా కారణం? దాన్నిచూసి వాంఛించిన నాపాపిష్టి నేత్రాలు....ఈ నేత్రాలే....ఇవే....యీ గుడ్లే, నన్ను మోహంలో ముంచి, నా విగ్రహాన్ని చంపి, నా మాటవినక, తిరస్కరించి—అమ్మా!

సువర్ణముఖి

నాతో మాట్లాడకు.

జయదేవుడు

నేను వెడుతున్నాను.

సువర్ణముఖి

వెడుతున్నావుగా! సంతోషమా? వెళ్లు.

జయదేవుడు

ఒక్క ప్రార్థన.

సువర్ణముఖి

ప్రార్థనా, పైగా, పో.

జయదేవుడు

ఒక్కటే. ఒక కత్తినియ్యి.

సువర్ణముఖి

ఎందుకు?

జయదేవుడు

ఈ దారుణ నాశనానికి చిహ్నంగా!

సువర్ణముఖి

వెళ్ళవూ?

[జయదేవుడు యిటూ అటూ

వెళ్లవా? అబ్బా!

[బాధతో లేచింది]

జయదేవుడు

అయ్యో! ఆ పాదాలు, ఆ చేతులూ ఎట్లా చూడగలను?

[కత్తెర నిచ్చింది]

సువర్ణముఖి

ఇదేవుంది.

జయదేవుడు

అవును. ఇంక చూడను. ఇంక ఎన్నటికీ చూడను.

సువర్ణముఖి

వెళ్ళు. నాకొక్క వరము నియ్యి.

జయదేవుడు

తప్పక.

సువర్ణముఖి

నిన్ను కోరే స్త్రీలు, నిన్ను వాంఛించే స్త్రీలు కోట్లకొలది వుంటారు.

జయదేవుడు

ఎవరూ లేరు. నాకు స్త్రీలు వొద్దు.

సువర్ణముఖి

వుంటారు నాకు తెలుసు.

జయదేవుడు

ఏం తెలుసు? ఎట్లా తెలుసు?

సువర్ణముఖి

ఇదివరకు తెలీదు....మొదట. ఇప్పుడు తెలుసును. నా కెట్లా తెలుసునో నీకు తెలీదా?

నిన్ను ఇష్టపడని స్త్రీ, యెవతో నిర్భాగ్యురాలు నా వంటిదివుంటే దానిని తిరస్కరించనని......

జయదేవుడు

ఇంక....ఇంకా బలాత్కారమా? ఈసారి స్త్రీని స్పృశించానా, హత మవుతాను! ఇదే నా ప్రతిజ్ఞ. జయదేవుడు మాటతప్పడు. బలాత్కారమా? స్త్రీలనే, యీ కాంతినే వొదిలిపొయ్యే నాకు....మోహమా? నా వైరాగ్యం నన్ను రక్షించలేక పోయిందా? సన్యసించినా నా యింద్రియాలే పాలించాయి నన్ను. విధి! కాని విధినే జయిస్తున్నాను. ఈ విధి యేమార్గాన నన్ను చేరుతుంది? ఈ కాంతి, వుదయం, అస్తమయం, యీవివిధవర్ణాలు, చిరునవ్వులు, స్తనాలకాంతి, చిరునవ్వు వెన్నెల అన్నిటికీ శలవు. నాచేత మానభంగం చేయించిన యీనేత్రాలు ....పాపిష్టి నేత్రాలు....

[కత్తెరతో కళ్ళు పొడుచుకొన్నాడు.]

ఈ కళ్ళే!

సువర్ణముఖి

అదేమిటి? అదేమిటి!

జయదేవుడు

జయించాను. లోకమా, నీ ప్రలోభాలకి అతీతుణ్ణి అయినాను. అందరూ నా బాధనించి విముక్తులైనారు.

(తడుముతో) నీ పాదాలు తాకనీ.

సువర్ణముఖి

ఇక్కడ, ఇక్కడ.

[చేతులు జాస్తోంది]

జయదేవుడు

పాదాలు.

సువర్ణముఖి

మీరు యతులు....కూడదు.

జయ దేవుడు

నేను యతినా ?

సువర్ణముఖి

పాపం, పాపం, యేంపని చేశారు ? ఎందుకు ? ఎందుకు ! నా విచారం వల్లనే.! రక్తం తుడవనీండి.

[ప్రేమతో తుడుస్తోంది]

పాపం ! మీ మోహాన్ని అణుచుకోవాలని ఎంత యత్నించారో ! అంధురాలినై, నా పాతివ్రత్య మూఢత్వంలో మునిగి, స్వార్థమే యోచించి, విలపించి మీ కెంత తీవ్రపశ్చాతాపాన్ని కలిగించాను ! ఏం చెయ్యను !

జయ దేవుడు

నీ మృదు హస్తాలు తగిలి నా బాధ పోయింది.

[ఏడుస్తోంది ఆమె]

ఏడవకు. నా కాళ్ళాడవు, ఇంతా ద్వేషించు. దూషించు యీపాపిని. నేను వెడతాను. దారి చూపు.

సువర్ణముఖి

ఎక్కడికి ?

జయ దేవుడు

లోకంలోకి.

సువర్ణముఖి

దారి యెట్లా తెలుస్తుంది ?

జయ దేవుడు

జటదారికి దారి కనపడదా ? విశాలమైన యీ ప్రపంచమంతా తోవలే ! ఏ తోవైతేనేమి ? కళ్ళులేని నాకు అన్నీ తోవలే. లక్ష్యమేమైనా వుంటే కదా మార్గావసరము ?

సువర్ణముఖి

నేనా ?

జయదేవుడు

నువ్వా ? నీవేమిటి ?

సువర్ణముఖి

నన్ను వెంటరానీయండి. తోవ చూపుతాను. నేను మీ నేత్రాలనై పరిచర్య చేస్తాను.

జయదేవుడు

నా వెంటనా ? నన్ను ద్వేషిస్తో.

సువర్ణముఖి

కాదు. ద్వేషంలేదు. అనుకున్నాను. పదండి.

జయదేవుడు

స్త్రీవి : నువ్వా ! స్త్రీవల్ల సన్యశించాను. స్త్రీవల్ల అంధుణ్ణి అయినాను. స్త్రీ నా పరమ విరోధి.

సువర్ణముఖి

నేను వొదలలేను మిమ్మల్ని. కాని నాకు సౌందర్యం లేదు.

జయదేవుడు

నాకు కనపడదుగా ?

సువర్ణముఖి

అవును. వుంటారా ?

జయదేవుడు

నీ మధుర కంఠరవం ? నీ స్నిగ్ధ వక్షపు ఆకర్షణ : నీవేళ్ళ వేడి....వొద్దు. పోనీ.

[పాడుతున్నాడు దిగులుగా......సువర్ణముఖి ఆయన పాదాల్ని కావిలించుకుంది.]

[బైటనించి]

యతీ! సంతుష్టిని పొందావా?

జయ దేవుడు

సంపూర్ణంగా. ధన్యోస్మి.

సువర్ణముఖి

ఆగరా?

జయ దేవుడు

నాకు నిలవ నీడలేదు. ప్రీలేని అరణ్య ప్రదేశాలే శరణ్యం నాకు.

[బైటికి వెడుతున్నాడు.]

[బైటనించి చీకట్లో]

యతీ! యీ అర్ధరాత్రి యెక్కడికి?

జయ దేవుడు

ఇంక ప్రపంచమంతా నాకు కాళరాత్రి. ఎనిమిది జాములూ నడిరాత్రి.

[జయదేవుడు పాడుతున్నాడు]

సువర్ణముఖి

యతీ! యతీ! నా హృదయాన్ని నీ పాటతో యీడ్చుకుంటూ వెడుతున్నావు.

———

# అయిదో రంగం

[అరణ్యం. ముళ్లపొదల్లో పడి మూలుగుతో జయదేవుడు పాడుతున్నాడు. వృద్ధభిక్షుకి వొచ్చింది.]

వృద్ధభిక్షుకి

తాపసీ, నీకీ గతియేమి ?

జయదేవుడు

ఎవరు నువ్వు ?

వృద్ధభిక్షుకి

ఇదే నా కుటీరం.

జయదేవుడు

నేను అంధుణ్ణి.

వృద్ధభిక్షుకి

పాపం !

జయదేవుడు

నీ కంఠరవం అమృతం లాగుంది.

వృద్ధభిక్షుకి

నీ గానంకంటేనా ?

[అతన్ని లేవదీసి కూచోపెట్టి ముళ్లు తీస్తోంది.]

వృద్ధభిక్షుకి

ఎక్కడికి ప్రయాణం ?

జయదేవుడు

పరలోకానికి.

వృద్ధభిక్షుకి

ఇదా మార్గం ?

జయదేవుడు

అంధుజ్ఞిగా!

వృద్ధభిక్షుకి

యతీ! నీముఖం చాలా తేజోవంతమైనది. నీ హృదయంలో అపారమైన జీవాన్ని సూచిస్తోంది. తుపానుకింది సముద్రంవలెఅల్ల కల్లోలమై వుండాలి నీ జీవితం, నీ హృదయంలో పెనుగులాడే వుద్రేకాలవల్ల. యతి వెందుకైనావో!

ఏదీ ముఖమెత్తు. నేత్రాలలోంచి ఏమీ తెలీటంలేదు. ఏదీ చూడనీ.... నీ కేమాత్రమూ మోక్ష సంస్కారం లేదు. అధ్యాత్మిక సోపానంలో మొదటి మెట్టునైనా తొక్కిన వాడివి కాదు. ఎందుకీ కాషాయవస్త్రాల్ని ధరించావు? ఈ అరణ్యమార్గాల తిరుగుతావు? పాపం, పాపం!

జయదేవుడు

నీకా కరుణ యెందుకు? కాషాయ వస్త్రాలు ధరించే ప్రతివారికీ జ్ఞానోదయమవుతోందా?

వృద్ధభిక్షుకి

క్షుద్ర మానవులు సన్యసించి క్షుద్ర యతులౌతారు. ప్రతిభావంతులు మహాపురుషు లౌతారు. వ్యక్తిలో వున్న జీవనశక్తి సంపూర్ణంగా వినియోగమైనప్పుడే సంపూర్ణానందం—సంసారంలో కానీ, అధ్యాత్మికంలోకానీ. నీవంటి వాడిలో వుండే అపార రసికోద్రేకము, సమస్త భోగాలలోనూ, తులతూగవలసిన నీ విశాల అనుభవసామర్థ్యం, ఇవన్నీ నాశనమవుతాయా నీవు యతివైనంత మాత్రాన! ఎంత వేదన! కాని, నీకే దైవకృపవల్ల జ్ఞానోదయమై, ఆరసికత్వమంతా, ఆ అనుభవసామర్థ్యమంతా, అధ్యాత్మిక సంపదగా మారి, లోకోద్ధరణానికి వినియోగపడితే, బుద్ధునిమించిన అవతారమూర్తివి అయివుండవా! కాని, అంతవరకూ పాపం! యీ అరణ్య సంచారమూ, యీ కందమూల భోజనమూ-పాపం! నీవు నిజంగా యతి

వై నావా ? నీ హృదయస్థమైన భీకరాగ్ని నీరసికో త్తేజము, నిన్ను కాల్చి, వెర్రెత్తించి భస్మం చెయ్యటం లేదా ? ఎంత తప్పువని చేశావు ? ఎందుకు యతి వై నావు నువ్వు !

జయదేవుడు

నా భయంకర వాంఛలనించి విముక్తిని పొందాలని. నా ప్రతిభనించి తప్పించుకోవాలని.

వృద్ధభిక్షుకి

ఎవరు చూపారీ మార్గం నీకు ? నీ గురువెవరు ? ఆ మూఢుడు—

జయదేవుడు

స్వయం గురుః.

వృద్ధభిక్షుకి

కాషాయవస్త్రం మన్మథబాణాలకు కవచ మనుకున్నావా? సర్వేంద్రియాలనూ బంధిస్తే మాత్రం కళాపూర్ణమైన నీ వుష్ణరుధిరాన్ని యెట్లా మార్చగలవు? ....తీవ్రయోగ సాధనవల్ల తప్ప.

జయదేవుడు

నీవు నాగురువై మార్గం చూపించి—

వృద్ధభిక్షుకి

నేనా ? నీకా ? అంత భాగ్యమా ? నాకా అధికారంలేదు.

జయదేవుడు

ఏమీ ?

వృద్ధభిక్షుకి

సామాన్య యతులకుగాని నీకు గురువు నయ్యే అధికారం నావద్దలేదు.

జయదేవుడు

మరి—

వృద్ధభిక్షుకి

నీవు గురువా: ఎన్నడో యీ లోకంలోకాదు. ఎక్కడో ఏ నరుడో నారాయణుడో!

జయదేవుడు

(నిరాశతో) అంతేనా!

వృద్ధభిక్షుకి

రా, యిట్లా విశ్రమించు....ఏదీ ఇందాక అంతబాధలోనూ, పాడుతున్నావే! వృక్షాలు, పక్షులు నమ్రములై మంత్రింపబడ్డట్లు వింటున్నాయి. ఆగానంలో నా వృద్ధహృదయం సహితం చీకి పేలికలైన నా స్త్రీ హృదయం చిగిర్చి అరవై సంవత్సరాల్ని ఒక్క గంతుకో సులభంగా వెనక్కి దాటగలిగింది. అట్లాంటి కళ్యాణ గీతాల్ని విని, జానపదస్త్రీలందరూ నీ పాదాక్రాంతులు కాలేదా? ఆ మధురగీతాల్ని రచించిందెవరు?

జయదేవుడు

ఈ నిర్భాగ్యుడు.

వృద్ధభిక్షుకి

నువ్వా! నువ్వా! హ హ హ! మోక్షమా, నీకు! వైరాగ్యమా!

[నవ్వులోంచి]

నవ్వాను తప్పు. ఇంత విషాద చరిత్రను చూడబోను. అయ్యో! నా పిచ్చియతీ! యతివా? నువ్వు యతివా?

[నవ్వూ ఏడుపూ కలిసింది కంఠంలో]

వీ నేత్రాలే విప్పి నువ్వు, ఆ పాటని కంఠంతోనేగాక చూపుతో గానం చేస్తోవుంటే నీకు వశ్యురాలుగాని స్త్రీ వుంటుందా? ఎంత వికృతం? ఈ వస్త్రాలేమిటి నీకు? అర్జునుడివలె ప్రచ్ఛన్నమా? ప్రపంచానంతా అర చేతులో వుంచుకుని ఆస్వాదించవలసిన మహాభోగివి ఏ ఘోర పాపం వల్లనో ఏ తీవ్రశాపంవల్లనో యిట్లా ఐనావు.

జయ దేవుడు

నియమం లేక ప్రేమించాను. స్వయంకృతాపరాధానికి స్వయంవిధితశిక్ష ననుభవిస్తున్నాను. భోగాలు చాలించి వైరాగ్యాన్ని పూనాను.

వృద్ధభిక్షుకి

వైరాగ్యమా? అంటే? ఎప్పుడు కలుగుతుంది ప్రపంచసుఖాలమీద వైరాగ్యం? మోక్షంమీద మోహంకలిగినప్పుడు. అల్పులకు వైరాగ్యం సులభం, తీవ్రవాంఛలు వాళ్ళలో లోపం గనక. నీ వంటి ఉత్తమపురుషులకి వైరాగ్య మెందుకు? నీ సౌందర్యవాంఛ, నీ కామశక్తి, నీ గానమాధురి, నీ కవిత్వాగ్ని, అన్నీ యీశ్వరుడి పాదాలవద్ద అర్పించే పుష్పాలుగా మారాలి. ఆ పుష్పాల్ని వికసింపజేసే ఆకాశతేజం వుదయించినప్పుడు యీ చిన్ని వెలుగులన్నీ, యీ స్వల్ప వాంఛలన్నీ, ఆ దివ్యతేజస్సులో లీనమౌతాయి.... నీ హృదయజ్వాలల్ని కాషాయవస్త్రాలకింద దాచాలని ప్రయత్నిస్తే, ఆ వస్త్రాలే మండి, నీ నేత్రాల్ని కాల్చాయి. అవునా!

జయ దేవుడు

గతి?

వృద్ధభిక్షుకి

ఏమో ఎప్పుడో! కాలమో, యీశ్వరుడో, మృత్యువో, కర్మమో—ఏమో తెలీదు. కానీ....ఏదైతేనేం? ఆ మహాశక్తివుందే, ఆమె హస్తాలికి వప్ప చెప్పు నీ జీవిత భారాన్ని.

జయ దేవుడు

ఎవరామె?

వృద్ధభిక్షుకి

(నవ్వి) ప్రపంచశక్తి—

జయ దేవుడు

ఈలోపున—

వృద్ధభిక్షుకి

అనుభవించు. దివ్యమైన బాధలో. ఏ నిముషానా శాంతినివ్వని నీ తీవ్ర రసికత్వంలో రక్తనృత్యం చెయ్యి.

జయదేవుడు

ఇక్కడే నివసిస్తాను.

వృద్ధభిక్షుకి

ఇక్కడా? నివసిస్తావా? పాపం నివసించగలవా? నివసించవీదు నీహృదయంలోని అగ్ని.

[వవ్వులో యేడుస్తోంది.]

---

# ఆరో రంగం

[అరణ్యం - పొద్దున్న తొమ్మిది గంటలు - జయదేవుడు దారి తడుము కుంటూ పాడుతూ వెళుతున్నాడు.]

జయదేవుడు

ఇంతే ఈజన్మానికి, అరణ్యసంచారమే గతి. ఎన్నటికన్నా కనిపించునా ఆ గురువు ? యీ తీవ్ర విరహాన్నించి నన్నుద్ధరించగల ఆ రుషి ! నా హృదయం, యీ పాప హృదయం-నన్నెన్ని దుర్గతుల కీడ్చింది? ఎక్కడ చూసినా నన్ను వొదలని స్త్రీజనం తోడ్పడ్డారు నా అధోగతికి. సన్యాసివి నేను పాడితే పొంగుతారు. పాడకుండా నిలవలేను. ఈ వీనులకన్నా సంతోషంలేకండా యీ అంధకారంలో ఎట్లా జీవించను పాడకపోతే? ఎట్లా ? నేను నేనే కాకుండాపోనా ? పాటవిని భిక్షలకు పిలుస్తారు. భర్తల చేత, భ్రాతలచేత, పిలిపిస్తారు. మృదువుగా మనసు కరిగేట్టు మాట్లాడ తారు. చేతిని తాకి కంపింపచేస్తారు, నేను భరించలేను. ఇంక జయదేవుడు మనుష్యప్రదేశాల సంచరించడు....హాయి హాయి ! ఏమి గాలి !

[పాడుతున్నాడు]

నేను అంధుణ్ణి కాకపోతే, ఆస్త్రీల మర్మదృష్టుల్ని చూసి భ్రమసి మళ్లీ మోహజాడ్యంలో చిక్కుకునేవాణ్ణే. ఇంక త్యజించాను. ఆ ప్రలోభాల్ని జయించాను.

[పాడుతున్నాడు]

ఈ అరణ్యవాయు వెంత సుఖంగా తాకుతోందో నన్ను! ప్రతిస్థలానా వెతికి నన్ను స్పృశిస్తోంది.

ప్రేమతో, నన్ను నా రసికాధిక్యతనూ తాను గుర్తించినట్టు........ దేవయాని తన వేళ్ళ కొనలతో నా చెంపల్ని, తొడల్ని తాకినట్టుంది. ఆమె తన మెత్తని జుట్టుచివర్లతో నా పక్కలకు గిలిగింతలు పెట్టినప్పటి మాధుర్యం తోస్తోంది. ఏమి పరిమళాలివి ? ఏ పవిత్రమైన పుష్పాల

నించో? నేనెరగనే! వాటి రూపమూ, చిన్నెలూ, యెంత ఆకర్షకంగా వుంటాయో! అట్లా అన్నాళ్ళూ ఆ పట్టణవాసం చెయ్యకపోతే-నేను పద్మావతితో, మదాలసతో, చెలులతో, కలిసి యీ అరణ్యాలలో ఒక్క- కుటీరం ఏర్పరచుకుని—ఛీ ఛీ! తిరిగి పద్మావతీ, మదాలసా అని పరిగెత్తుతోంది మనసు. కాని పద్మావతి....పద్మావతి ప్రేమకూడా నిగ్రహార్హమా! కాదు. వీలులేదు. పద్మావతి మృదుమోహం నన్ను బంధించి కష్టణ్ణి చెయ్యనేలేదు. నా మనోచంచలమే నా జాడ్యకారణ మయింది. వీలులేదు, పద్మావతి ప్రేమను నిరసించను. పాపిని, కృతఘ్నుణ్ణి....

నాకే నేత్రాలుంటే యీ అరణ్య సౌందర్యాన్ని చూసి ఆనందించేవాణ్ణి కదా! చిన్న సెలయేళ్ళపక్కన పచ్చికబయళ్ళు....వెన్నెల....కాని, వొంటరిగా ఆ సౌందర్యాన్ని భరించగలనా? సెలయేటి నీళ్ళలో నాతో కూడి నవ్వుతో, నీళ్ళు చిమ్ముతో—

ఛీ ఏంచెయ్యను? నా మనసులోంచి యీ సుందరస్మరణలు, యీ దివ్య వాంఛలు, తొలిగిపోవు. నా కళ్ళను పెకలించినట్లు యీ మెదడును పెకలించనా? ఏం చెయ్యను! ఏది శరణ్యం! ఈశ్వరుడే దిక్కు. హా కృష్ణా!

[పాడుతున్నాడు]

వహతి మలయసమీరే
మదనముపవిధాయ
స్ఫుటిత కుసుమనికరే
విరహ హృదయ దళనాయ

కృష్ణా, యీ కుసుమాలు నీ హృదయాన్నే అట్లా చీల్చగల్గినాయే—కృష్ణా!

చంచల కుండల దళితకపోలా
ముఖరిత రశన జఘనగతిలోలా!

కృష్ణా, ఎంతరసికుడివి! ఈ అరణ్యప్రదేశాల్లో!

లలిత లవఙ్గ లతా పరిశీలన
కోమల మలయసమీరే

ఓహో కృష్ణా!

ఛా! యీ వర్ణన లెందు కిప్పుడు, మరి విరాగిని నేను రశికావతంసుడు. కృష్ణుణ్ణి యిష్టదైవం చేసుకోవడ మేమిటి? నాకు రుద్రుడే శరణ్యం-

[పాడుతున్నాడు]

లాభంలేదు. ఆ రుద్రుడా అర్ధనారీశ్వరుడు—ఈ దేవతలందరికీ యిదే జాడ్యం— ఒకరికి స్త్రీనెత్తిన— ఒకరికి వక్షాన— ఒకరికి తొడలమధ్యనే— ఈదేవతల్ని ఆరాధించి—స్త్రీలోలురైన యీదేవతలు నాకన్న యేమిఅధికం? దేవతలే అట్లా ఐతే యింక లోకమే అంత. ఈ విరక్తికోసం నేను పడ్డ యీ దారుణ క్షోభంతా వ్యర్థమా?

నిర్గుణుణ్ణి ధ్యానం చేస్తాను.

[పాడుతున్నాడు]

ప్రపంచమే, యీ ఆకర్షణ మంత్రం పొందిన రూప మంటారు. సతీ యీశ్వర సంభోగంవల్ల కలిగిన ప్రకాశ పిండం యీ భూలోకం. ఆ భూమిలోపుట్టిన మాకు ఎంత ప్రయత్నించినా, ఎంత విరక్తిచెందినా, ఏకత్వంలో ఆత్మ సంక్రమిస్తుందా?

[ఆలోచిస్తున్నాడు]

ఈ పక్షుల గానం—ఆ పిక మెట్లా యెన్నిమృదువైన విధాల పిలుస్తోందో తన ప్రియురాల్ని? ఏమి స్వేచ్ఛ! ఆ జంటలు ఆకాశమంతా పరువు లెత్తుతాయి, ఆనంద పారవశ్యం చెందుతో నాకు కనపడని కాంతిలో తేలి పోతాయి. ఆకుల పచ్చని నీడల్లో, ముక్కూ ముక్కూ కలిపి క్రీడిస్తాయి. నేనా పక్షినై వుండకూడదూ? ఇంక వినలేను.

[చెవులు మూసుకొంటున్నాడు]

ఈ ద్వంద్వం, యీ స్త్రీపురుషాకర్షణ జీవితస్వభావంలోనేవుంది, సృష్టి

కారణంలోనే యిమిడి! నా ర క్తంలో, నా అస్థుల్లో రహస్యసూత్రమై నడిపిస్తోంది. ఏంలాభం యెదురీది ?

ఇట్లా కూచుంటాను, ఏ పుష్పాలో యివియింత మదపు వాసనల్ని వెదచిమ్ముతున్నాయి ? ఈ పరిమళం—తలవిప్పే యీ పరిమళం! ఇది స్త్రీ పుష్పాల పిలుపు, పురుష రజంకోసం, అందువల్లనే నన్నిట్లా వుడుకెత్తిస్తోంది. ఎట్లా ? లోకమంతా ఈ సంభోగేచ్ఛ, పుష్పాలు, పక్షులు, మృగాలు, మనుష్యులు, దేవతలు, ఋషులు, అందరూ, అన్నీ. యీ మృత్తిక, యీగడ్డి, యీగాలి, అన్నీ, అన్నీ—లోకమే సంభోగనృత్యం చేస్తోంది. ఈ రంగులు, శబ్దాలు, మృదుత్వాలు, మధురమైన అనుభవాలన్నీ సంభోగపు ప్రయత్నాలు. ఎక్కడికి పోను ? ఎట్లా తప్పించుకోను ? ఈ చెట్టు నానుకుని కూచుంటాను.

[పాడుతున్నాడు]

ఈ స్కంధం యెంత గట్టిగా నున్నగా తగులుతోంది! నా వీపునించి గంభీరంగా పైకెదిగి కాంతిలోకి, ఆకాశంలోకి కొమ్మలెత్తుతోంది. నా పద్మావతి నాట్యంలో హస్తాల్ని వూయించినట్లు—నా పద్మావతి బాహంపుల మల్లే నున్నగా, గట్టిగా, కొత్త చిరుచెమటలతో చల్లనైన ఆమె—ఇంక చాలు—ఈశ్వరా—ఈశ్వరా—నాకు మోక్షంలేదా ?

[పాడుతున్నాడు]

పద్మావతి యెవరు ? నే నెవరు ? పో, పో, నన్ను విడిచి పో. స్త్రీ, పిశాచీ, ఆత్మవిరోధీ, పో. నా మనసులోంచి పో.

నన్ను పద్మావతి విడవదు. ఎంత తరిమినా విడవదు. ఈశ్వరుడికైనా స్థలాన్ని వొదలదు. నన్నంత ప్రేమించిన పద్మావతి! జీవితంలో ....మృత్యువులో....

నన్ను వొదలలేక యీగాలిలో, యీపువ్వుల్లో, నన్ను సమీపిస్తోంది. చూడ దానికి కళ్ళులేవు. చెవుల్లోంచి యీ పరిమళాల్లోంచి నన్ను పలకరిస్తోంది,

నేను క్రూరుణ్ణి. మూర్ఖవైరాగ్య నియమంతో నాపద్మని తోసేస్తున్నాను. పద్మా! పద్మా!

[ఏడుస్తున్నాడు.]

పద్మా! నీ రమణీయ జఘనవర్తిని నేను చివరికి దిక్కులేక యీ అరణ్య మార్గాల నశిస్తున్నాను.

ఛీ! నేను సన్యాసిని. పద్మావతి యెవరు? మాయ. నా మనోభ్రాంతి. అవును. పద్మావతీ నేను నిన్నెరగను పో. జయదేవుడు చచ్చాడు. నేను యతిని. పో. పోదు. ఎట్లా? ఈశ్వరుణ్ణి స్తుతిస్తాను. ఈశ్వరా! ఎవరునువ్వు? సమస్తమూ సృజించిన శక్తివి, మహా మాతవు. నన్ను, ఈఅంధుణి ఆదరించి, కనికరించి, నీ ఆలింగనంలో చేర్చుకో, నీ మందహాసంలో, నీ మృదువక్షంమీద, తల్లీ మహాజననీ, కావిలించుకో—నువ్వూ, నేనూ, నృత్యంచేద్దాం యీ శూన్యప్రపంచంలో నువ్వూ నేనూ, ప్రియా, నా హృదయప్రియా—ఆహా! ఆహా! యేమి యీ పూవు—యేమి యీ పెదవుల మాధుర్యం! పాడతాను- పాడతాను. కొత్తగీతం అవును. మన ప్రేమగీతం పాడతాను.

[పాడుతున్నాడు]

ఓహో యెంత గొప్పగావుంది! ఈ హృదయంలోని వుత్సాహం. యీ మధురగీతం యెవరికి? ఎవరి కొరకు? వినేవా రెవరు? ఈ అంధత్వంవల్ల గావును. నా ప్రేమ లోపలలోపలే కుమిలి లీనమై, యెంత వున్నతమైన భావాలు, యెంత మధురమైన శబ్దాలై, స్రవించిందో! ఎట్లా ప్రచారమౌతుంది? ఇంత సౌందర్యమూ నాతో అంతం కావలసిందే? ఒక్క యీ గీతం జనుల చెవుల్లో మోగితే చాలు! నా జీవితం ధన్యమౌతుంది. నాకింక యీశ్వరుడూ వొద్దు. మోక్షమూ అవసరం లేదు. ఇది, యీ నా గీతం, నా కడసారి బిడ్డ, యీ అరణ్యంపాలై నశించవలసిందేనా? కాదు, కాదు. వీల్లేదు. ఈ గానం యిట్లా నిలిచిపోవాలి.

[పాడుతున్నాడు]

వినండి. వృక్షాలూ వినండి. పక్షులూ, పుష్పాలూ, పర్వతాలూ, మధుపాలూ వినండి. మారుపలకండి, మీ కర్థమౌతోందా యీ పదసౌష్టవం, ఈ సౌందర్యం, నా హృదయంలోని ఆనందం. చూడండి, చూడండి. దిక్కులు తళతళ మంటోంది.

[పాడుతున్నాడు]

ఈ వనకాంత, యీ సృష్టికాంత నిరంతరమూ వెతుకుతోంది నాకు కనపడని యీ రంగంమీద అలంకరించుకొని. యీ పరిమళాలతో ఆకర్షకమైన వెలుతురుతో వెతుకుతోంది. ఈ రాధ నిరంతరమూ, పరమాత్ముడు, కృష్ణుణ్ణి యీ ప్రపంచమంతా వెతుకుతోంది. అదుగో, పిలుస్తోంది, నన్నే! నేనే కృష్ణుడు. నేనే! ఇంకెవరు? రాళ్లు, పులులు, పుష్పాలు. రండి! గోపికలు, రాక్షసులు, ప్రజలు, బాధలు, పర్వతాలు, లోకాలు రండి రండి!! నా ఆలింగనంలోకి. ఈ దివ్యగీతంలో జోకొట్టి నిత్యశాంతినిస్తాను.

[పాడుతున్నాడు]

ఈశ్వరా! విను, యీ గీతం విను. ధన్యమౌతుంది నీస్థితి! నీ ముసలి హృదయం చిగిర్చి నూతన సృష్టి ప్రారంభించగలవు. ఈ జడపదార్థాలన్నీ నృత్యంచేస్తున్నాయి నాలో. ఈశ్వరా! రా! నుంచో యిక్కడ! విను, విను, నీబాధల్లోని అల్పత్వం, నీ మృత్యువులోని నిస్సహాయత్వం, నీ దుఃఖాల్లోన్ని సంకుచితత్వం అన్నీ నశించాయి. యీనాటితో నీలోని వికృతత్వం, ద్వంద్వత్వం, విరోధత్వం, కర్కశత్వం, అన్నీ చూడు మహాపర్వతాలవలె కరిగిపోతున్నాయి ఈ గానాగ్నిలో, విను.

[పాడుతున్నాడు]

సృష్టి! నృత్యం సాగించు. పద్మావతి లేదు, నూతనగీతం రాగానే మృదుపాదాల్ని నా హృదయంలో ఘల్లుమనిపించేందుకు. సృష్టికాంతా! రాపీ, ఆకాశాన మబ్బుల్లో జుట్టు విరబోసుకుని, నక్షత్రాలు పూలుగా, దిక్కులకి చేతులుజాచి, ఈ వింత అరణ్యాంబరందాల్చి, ఈ సముద్రాలే

మర్మధారలుగా, మా బాధల్ని, మా ప్రాణాల్ని, మా మరణాల్ని, కాళ్ళకు కట్టుకుని, తాండవించు నూతన సందేశాన్ని, సుందర ప్రణయాన్ని నటించు,

[జయదేవుడు పాడుతున్నాడు. ఒక గొల్లపిల్ల యెదురొచ్చింది.]

గొల్లపిల్ల

ఆహా! యేమిపాట! స్వామీ నమస్కారం.

జయదేవుడు

సృష్టికాంతా! వొచ్చావా?

గొల్లపిల్ల

నేనూ! యశోదని.

జయదేవుడు

ఓహో యశోదవా! కృష్ణుణ్ణి పరమాత్మనే పెంచిన జగన్మాతవా? ఈ రూపాన అవతరించావా నాముందు, జగత్శక్తీ! సృష్టికాంతా!

ఇది బృందావనమా? అందువల్లనా ఈ పరిమళం! ఈ రసన! కృష్ణుడూ గోపికలు సంభోగించి వొదిలి వెళ్ళిన పరిమళాలివి. యశోదా దేవీ! ఏవీ నీపాదాలూ? ఏవీ నా చిన్నికృష్ణుడు కూర్చున్న తొడలు!

యశోద

స్వామీ! చిన్ని కృష్ణుడు నాకు తెలీదు. దాసురాలిని నన్నాశీర్వదించండి - నమస్కరిస్తున్నాను.

జయదేవుడు

కాదు. నీవు యశోదవే. నన్ను నీపాదాలు తాకనీ.

[తాకుతున్నాడు.]

యశోద

స్వామీ, స్వామీ కూడదు నేను దాసురాల్ని.

జయ దేవుడు

ఈ చిన్నిపాదాలే నాట్యంచేస్తేనా, నా కొత్తగీతానికి! విను.

[పాడుతున్నాడు.]

యశోదా! చిన్నికృష్ణుడు—

యశోద

కృష్ణు డెవరూ?

జయ దేవుడు

నీబిడ్డ. పరమాత్మ.

యశోద

నాకు పెళ్ళికాలేదు.

జయ దేవుడు

అవును. నువ్వెవ్వరు?

యశోద

యశోదను. గొల్లపిల్లను.

జయ దేవుడు

ఓ! నీవు ఏంచేస్తున్నా విక్కడ?

యశోద

(సిగ్గుతో) తిరుగుతున్నాను.

జయ దేవుడు

ఇల్లులేదా?

యశోద

అరకోసుదూరం. మా ఊరు దయచేయండి.

జయ దేవుడు

నేను ప్రజా ప్రదేశాలకు రాను.

యశోద

అయితే తమకు ప్రసాదం యిక్కడికే తెస్తాను. పాలూ, పళ్లూ, ఇక్కడే వుండండి.

జయ దేవుడు

వొద్దు నన్ను విడిచిపోకు. నీ కంఠంవింటే చాలు, నీవు దగ్గిరగా వుంటే చాలు, నా పక్కన కూచో.

యశోద

రండి, ఇక్కడే చక్కని ప్రదేశం కొండచివరగా వుంది.

జయ దేవుడు

నాకు అందం కనపడదు కద.

యశోద

నాకు కనపడుతుంది. మీకూ వినపడుతుంది, కొండమీదినించి కిందికి దూకే సెలయేటి విసుడు మీరు పాడే పాటకి శ్రుతి.

జయ దేవుడు

పద.

[యశోద బుజం పట్టుకుని జయదేవుడు నడుస్తున్నాడు.]

జయ దేవుడు

యశోదా! నువ్వు చాలా పసిదానివి. నీ మాటల అమాయకత్వం, నీ కంఠ కోమలత్వం, నీ బుజం పచ్చదనం చెప్పుతున్నాయి నాకు.

యశోద

అవును. స్వామీ, మీ రెక్కణ్ణించి వొస్తున్నారు? ఎక్కడికి వెడతారు?

జయ దేవుడు

అదంతా మరిచిపోయినాను. ఇక్కడికే.

యశోద

ఇట్లా కూచోండి. మీ ముందు అగాధమైన లోతు. కింద పొలాలూ పొదలూ——

జయ దేవుడు

పక్కన నువ్వా!

యశోద

అవును స్వామీ. ఇందాక పాడిన పాట పాడండి.

జయ దేవుడు

వింటావా. వినాలనే అభిలాషవుందా నీకు! పాడతాను.

[పాడుతున్నాడు.]

ఓహో! ఓహో! ఇంక హృదయం భరించలేదు. ఈశ్వరా, వింటున్నావా? ఈ సృష్టి నృత్యంతో యేకమౌతోంది నా గానం— లేకపోతే— యెక్కణ్ణించి భరింపరాని యీ ఆనందం యిట్లా వెల్లువలై ముంచేస్తోంది. నన్ను!

యశోదా, నన్నానుకో—వినేవారు పక్కన వున్నారనేభావం మరింత వుత్సాహాన్నిస్తుంది.

[పాడుతున్నాడు.]

యశోద

స్వామీ బావుంది.

జయ దేవుడు

యెవరు మాట్లాడేది?

యశోద

నేను.

జయ దేవుడు

నేనా?

యశోద

యశోదను.

జయదేవుడు

ఆ ! యశోద. తల్లీ ఎట్లా వొచ్చావమ్మా యిట్లా ?

యశోద

నేను యశోదని గొల్లపిల్లని.

జయదేవుడు

నువ్వా ! అవును ఏమన్నావు ?

యశోద

ఇంకా పాడమన్నాను.

[పాడుతున్నాడు.]

జయదేవుడు

ఇంకేంపాడను ? ఈ గీతానికి అంతం ఈహృదయమే. అంతే. అక్కడ అట్లా నశించిపోవలసిందే.
యశోదా !

యశోద

స్వామీ !

జయదేవుడు

చూడు నాకొక్క వుపకారం చెయ్యాలి నువ్వు.

యశోద

ఆజ్ఞ.

జయదేవుడు

ఈ పాట నువ్వు నేర్చుకోవాలి.

యశోద

నాకు చేతనవుతుందా ! నే నెన్నడూ పాడలేదు.

జయదేవుడు

తప్పదు. ఇదే నా కడపటి సందేశం లోకానికి. నువ్వే దీన్ని ప్రచారం చెయ్యాలి.

యశోద

నేనా ?

జయదేవుడు

నీకు నేర్పుతాను. పాటా నేర్పుతాను, పాడేశక్తినీ యిస్తాను. నేను నేర్పితే, రాళ్లైనా మధురధ్వనులతో కంపిస్తాయి.

యశోద

చిత్తం.

జయదేవుడు

యశోదా నీకు పెళ్లి అయిందా ?

యశోద

లేదు.

జయదేవుడు

ప్రియుడున్నాడా ?

యశోద

ఊఁ.

జయదేవుడు

అతను పాడవొద్దంటే ?

యశోద

అనడు. అతనికి సంగీతంమీద చాలా అభిరుచి.

జయదేవుడు

మంచిది. కానీ.

[జయదేవుడు యశోదకి పాట నేర్పుతున్నాడు.]

జయ దేవుడు

ఆహా ! ఏం కంఠం ? ఏం మార్దవం?....బావుంది....బావుంది....కానీ....

[పాడుతోంది.]

ఎవరు నువ్వు ! పద్మావతివి. కాదు. రాధవి. నీ పేరేమిటి ?

యశోద

యశోద.

జయ దేవుడు

కాదు. రాధ. నీ పేరేమిటి ?

యశోద

రాధ.

జయ దేవుడు

ఇట్లారా. పక్కన కూచుని పాడు మళ్ళీ.

[పాడుతోంది.]

రాధా !

యశోద

ఏమిటి స్వామీ ?

జయ దేవుడు

(వెర్రి కోపంతో) ఏమిటిస్వామీ ? అడుగుతున్నావా ? నన్ను చంపడానికి. నా ప్రాణం చీల్చడానికి యెవరు పంపారు నిన్ను! పో, పో, దూరంగాపో.

[భయపడి దూరంగా జరిగింది.]

రాధా ! రాధా ! ఆక్కడ్డించేపాడు. నాతో కలిసి పాడు.

[ఇద్దరూ పాడుతున్నారు. జయదేవుడు మధ్యలో ఆపాడు.]

యశోద

తరవాత ?

జయ దేవుడు

తరవాత- తరవాత (చెయ్యిజాచి). తరవాత గానమూలేదు, గీతమూలేదు. అటుతరవాత పరమాత్మ. ఆది అంతాలులేని నిర్గుణాకాశం. ఈగీతం ఆ అంతంలో ఆ అనంతంలో కలిసిపోతోంది. అట్లా అనంతమైన ప్రయాణం చేస్తోవుంటుంది, నాకంఠం నీకంఠం. ఏమో, ఆ కొాననించి కిన్నెరులే అందుకుంటారో, లేక వాళ్ళనీ మించి, చుక్కల్ని దాటి, బ్రహ్మలోకాన్ని అతిక్రమించి నూతన సృష్టికి కారణమౌతుందో, నా మధుర గానం!

[ఇద్దరూ పాడుతున్నారు]

రాధా ఏదీ నీముఖం! నీ స్వరమాధుర్యానెట్లా అనుభవించాను! ఆగాన మంతా అట్లా చెట్లల్లో పుట్లల్లో, వ్యర్థమై కలిసి పోవలసిందేనా? కాదు, కాదు. నాలో లీనం చేసుకుంటాను. ఏవీ, నీకళ్ళు. పాడేప్పుడు గాన పారవశ్యంలో మత్తెక్కి ఎట్లా చూస్తావో అనుకుంటాను. మన కంఠాల వల్ల జీవితాలు కూడా ఐక్యమైనాయి. నాతో రా. ఇద్దరమూ కలిసి లోకాన్నంతా సుందరగానంలో నింపి దరిద్రాన్ని, వికారాన్ని, మలినాన్ని కడిగి తుడిచి, శుభ్రం చేద్దాం. నీ జీవితం నాది....మన జీవితాలు ప్రపంచానివి. రా .

[కౌగిలించుకుంటున్నాడు]

యశోద

ఇదేమిటి స్వామీ! నన్ను వొదలండి.

జయ దేవుడు

నువ్వు నా రాధవి. ఎంత అందం? గుడ్డి చేతులకే తెలిసింది. ఆ చెంపల లేతదనం, ఆ బుజాల వొంపూ. ఈ నడుము వూపూ-
నీతో కలిసి నేను—

[యశోద తప్పించుకుని దూరంగా జరిగింది]

జయదేవుడు

రాధా !

యశోద

స్వామీ !

జయదేవుడు

రాధా, యిట్లారా.

యశోద

స్వామీ !

జయదేవుడు

ఏడుస్తున్నావా ? నాకు కోపము లేదు. ఏడవకు.

యశోద

మీ సంగతి కాదు.

జయదేవుడు

ఇంకెందుకు ?

యశోద

స్వామీ నన్ను మైల చేశారు. ఈ దేహాన్ని మలినం చేశారు.

జయదేవుడు

నేను తాకితే మలినమా ! వెర్రిపిల్లా ! నీవు రాధవి. నేను కృష్ణుణ్ణి.

యశోద

ఇది, యీ శరీరం నా ప్రియుడిది. కొత్తదీ, నిర్మలమైనదీ, ఐన నా చిన్నిదేహాన్ని అతనికే యిస్తానన్నాను. నన్ను గానంలో మరిపించి, ధ్వసం చెయ్యాలని చూశారు. ఇంక నేను బతకను-నాకింక ఏ ఆశాలేదు.

జయదేవుడు

మళ్ళీ మొదలా ? అంత ఘోరంచేశానా ? ఈ అడివి పుష్పం ముఖాన ముద్దుపెట్టుకోబోయి వుమ్మి వేశానా? నేనేనా అట్లాంటిపనిచేసింది ? కాదు.

నేను చెయ్యను. నన్నావహించిన రాక్షసి, నన్నువొదలని యీ పిశాచి, దీన్ని తగలేస్తాను. ఇంక క్షమించను. ఏం చెయ్యను ? ఈ మెదడును పగలగొట్టి తునకలు చేస్తే ? కాదు. ఇంక ఆహారం, సంచారం సమాప్తి. తపోగ్నితో యీ యింద్రియాల్ని కాల్చి మాడుస్తాను. నా గానం ముగిసింది. ఇంక ఒక్కగీతమూ వెడలనీను. కొండశిఖరానికి తోవటియ్యి. నన్ను తాకకు. మాట్లాడుతో ముందు నడు, రాధా.

మళ్ళీ ! మళ్ళీ ! సన్యసించినా, కళ్లు పొడిచినా అరణ్యదాస్యత చేసినా, యీ పశువు యీ రాక్షసి వొదలవా భూతమా నన్ను ! నిన్ను నాశనం చేస్తాను. ఎక్కడ దాక్కున్నావు ? మెదడులోనా, నరాల్లోనా, హృదయంలోనా, నశించావురా, యీ నాటినుంచి వొదిలిపో. పోవా ? నిన్ను అగ్నిలో మాడ్చి భస్మం చేస్తాను.

రాధా ! మాట్లాడవా ? ఎట్లా పరిహారం చెయ్యను ? మరణమొక్కటేమాత్రం నన్ను వొదులుతుందా యీ జాడ్యం ?

రాధా ! నీ చిన్ని పాదాలు తాకనీ. నీ పాదా లేవీ !

[ వెతికాడు-యశోద తప్పుకుంటోంది. ఆమె అందక, ముందుకునడిచి అగాధంలోకి జారిపడ్డాడు. ]

యశోద

అయ్యో ! అయ్యో !

ఎంతపిచ్చిపని ! అయ్యో ! పోనీ నా దేహాన్ని మీకే, మీ గానానికే అర్పించేదాన్ని కద !

(కిందికి చూస్తో) మాంసపు ముద్ద. ఎంత మాధుర్యం ! ఎంతఆధిక్యం ! ఆ కంఠమూ మాధుర్యం యేమైనాయో !

ఛీ ! నాతుచ్ఛ శీలంవల్ల యెంత ఔన్నత్యాన్ని చేధ్వంసం శాను.

## చలంగారి నాటకాలు

# చిత్రాంగి

చిత్రాంగీ సారంగధరుల ప్రణయగాథ.

వెల 1–8–0

# త్యాగం

పాతివ్రత్యాని కొక పరీక్ష।

వెల 1–8–0

# మంగమ్మ

ఒకరి తప్పు ఒకరితోనే పోదు. సంతానానికి కూడా చుట్టుకుంటుందనేది కధావస్తువు.

వెల 1–0–0

# శశాంక

వెల 1–0–0

# సత్యం - శివం - సుందరం

[నాటికలు]

వెల 1–4–0

# చలంగారి రచనలు

| | | |
|---|---|---|
| 1. అరుణ | ... | 0-12-0 |
| 2. మైదానం | ... | 1- 0-0 |
| 3. బ్రాహ్మణీకం | ... | 0-12-0 |
| 4. హంపీ కన్యలు | ... | 0-12-0 |
| 5. దైవమిచ్చిన భార్య | ... | 1- 8-0 |
| 6. స్త్రీ | ... | 2- 0-0 |
| 7. బిడ్డల శిక్షణ | ... | 1- 8-0 |
| 8. పాపం | ... | 0-12-0 |
| 9. కన్నీటి కాలువ | ... | 0-12-0 |

Printed at the B. N. K. Press, Madras—Q. H. No. Ms. 100/B.
For Q. H. No. 401. Cat D. 750. Copies—April 1946.

# చలంగారి రచనలు

| | | |
|---|---|---|
| స్త్రీ | .... | 2- 0-0 |
| బిడ్డల శిక్షణ | .... | 1- 8-0 |
| సత్యం శివం సుందరం | .... | 1- 4-0 |
| చిత్రాంగి | .... | 1- 8-0 |
| మంగమ్మ | .... | 1- 0-0 |
| మైదానం | .... | 1- 0-0 |
| హంపీకన్యలు | .... | 0-12-0 |
| అరుణ | .... | 0-12-0 |
| పాపం | .... | 0-12-0 |
| కన్నీటి కాలవ | .... | 0-12-0 |
| బ్రాహ్మణీకం | .... | 0-12-0 |

యువ బుక్ డిపో

మద్రాసు — బెజవాడ



YUVA ...
PUBLICATION

JAYADEVA
.. By CH.